Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 53 • 31-12-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# జగన్ దృష్టంతా కడప ఉపఎన్నికపైనే!

**● జిల్లాలోని ముగ్గురు మంత్రులూ వ్యతిరేకులు కావడం, సాధారణ ప్రజలు, కార్యకర్తలతో సంబంధాలు లేకపోవడం జగన్‌కు కాస్త ఇబ్బందిగానే వుంది.**

కడప లోక్‌సభ ఉప ఎన్నికకు త్వరలో నోటిఫికేషన్ విడుదల కానున్నదని తెలియడంతో వైఎస్ జగన్ తన దృష్టి మొత్తాన్ని అక్కడే కేంద్రీకరిస్తున్నాడు. ఈ నియోజకవర్గంలో తానను కున్నంత సానుకూలత లేదని అర్థం కావడమే అందుకు కారణం. రాష్ట్రమంతటిలోకి కడప జిల్లాలో తన తండ్రి మరణం పట్ల సానుభూతి అధికంగా వుంటుంది కాబట్టి, ఇక్కడ గెలుపు కోసం ఆలోచన చేయనవసరం వుండదనే ధీమాతో లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేశాడాయన. పులివెందుల శాసనసభ నియోజకవర్గంలో ఆయన అంచనా నిజమే అయినా కడప లోక్‌సభ నియోజకవర్గంలో మాత్రం పరిస్థితులు అంత సుకరంగా లేవన్నది నిజం. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి స్వంత తమ్ముడు వైఎస్.వివేకానందరెడ్డి కాంగ్రెస్ పక్షం చేరడం చాలా ఇబ్బంది కల్గిస్తున్నది. మొదట నుంచి జిల్లాలో దిగువస్థాయి కార్యకర్తలు, గ్రామస్థాయి నాయకులతో వివేకానందరెడ్డికి పరిచయం, సాన్నిహిత్యం ఎక్కువ. రాజశేఖర్ రెడ్డి కూడా తరచూ ఆ మాట చెప్పేవాడు. మా జిల్లాలో నాకంటే మా "బుద్ధుడి" పలుకుబడి ఎక్కువ అని వ్యాఖ్యానించేవాడు. ఆ పరిస్థితే ఇప్పుడు జగన్‌కు ఇరకాటంగా మారింది. కుటుంబపరంగా జగన్‌తో వివేకానందరెడ్డి సంబంధాలు పూర్తిస్థాయిలో దెబ్బతిన్నాయి. ఇద్దరి మధ్య ఒద్దిక కుదర్చడానికి ఎంత మంది ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. కడప లోక్‌సభ నియోజకవర్గంలో కాంగ్రెస్ అభ్యర్థిని గెలిపించడం తన ప్రతిష్టగా భావిస్తున్నాడు వివేకానందరెడ్డి. కాంగ్రెస్ నాయకత్వశ్రేణి మొత్తం ఆయన వద్ద కేంద్రీకృతమౌతున్నది. మండలాధ్యక్షులు, జడ్పీటీసి సభ్యుల స్థాయిలోని నాయకులలో అధికభాగం జగన్‌కు దూరంగా మెలగుతున్నారు. కడప జిల్లాలో సాధారణ ఓటరు కంటే, ఈ గ్రామస్థాయి నాయకుల మీదనే ఎన్నికల ఫలితాలు ఆధారపడి వుంటాయన్నది జగమెరిగిన సత్యం.

మరొకప్రక్క డిఎల్.రవీంద్ర రెడ్డి కూడా అంతే పట్టుదలతో ప్రయత్నం చేస్తున్నాడు. ఆయన నియోజకవర్గం కూడా ఈ లోక్‌సభ పరిధిలోకి వస్తున్నది. తన శాసనసభ నియోజకవర్గంలో డిఎల్‌కు పట్టు ఎక్కువ. ఆయన ఇప్పుడు మంత్రి కావడంతో కొంచెం అటు ఇటుగా వున్నవారు కూడా సర్దుకొంటున్నారు.

జిల్లాలోని ముగ్గురు మంత్రులూ తనకు వ్యతిరేకులు కావడం జగన్‌కు కష్టంగా మారింది. ఎన్నికల సమయంలో ఈ మంత్రులు తమ అధికార బలాన్ని వినియోగిస్తే, చాలా గ్రామాలలో ఎన్నిక ఏకపక్షమై పోయే ప్రమాదం వుంది. పోలీసు రక్షణ తప్పిస్తే చాలు, సగం మంది గ్రామ నాయకులు ఇంటిలో నుంచి బయటకు కాలు కదపలేని పరిస్థితులు వుంటాయక్కడ. తమ మాట వినని గ్రామ నాయకులను పోలీసుల ద్వారా ఒత్తిడి తెచ్చే అవకాశం మంత్రులకు వుంటుంది.

మరొకపక్క గత ఆరేళ్లలో జగన్ ఆస్తిపాస్తులు అనూహితంగా పెరిగిపోవడం వారి స్వంత అనుచరులలోనే అసూయగా వుంది. పులివెందుల, ఇడుపులపాయ, కడప తదితర చోట్ల ఆయన నిర్మించిన రాజసౌధాల వంటి భవనాలు జగన్ ఆర్థిక అభివృద్ధికి నిలువుటద్దాలు. తమ కళ్ల ముందే చిల్లర

కొరవ 14వ పేజీలో

# కేసులెట్లా ఎత్తేస్తారు?

గత సంవత్సరం తెలంగాణ ఉద్యమంలో హింసకు పాల్పడిన ఉద్యమకారులపై పోలీసులు దాఖలు చేసిన కేసులన్నిటినీ ఎత్తి వేయాలని నిర్ణయం తీసుకొన్నది రాష్ట్ర ప్రభుత్వం. అందులోనూ వికారం కల్గించే నాటకీయతతో రాజకీయ సర్కస్ క్రీడ నడిపారు. నిజానికి ఈ కేసుల విషయంలో తెలంగాణ రాష్ట్ర సమితి ఎమ్మెల్యేలు మొన్నటి శీతాకాల సమావేశాలలోనే అల్లరి చేశారు. సభ జరగనివ్వకుండా అడ్డుకొన్నారు. కానీ అప్పుడు ప్రభుత్వం వారి మాట వినలేదు. తీవ్ర హింసతో ప్రమేయం వున్న కేసులను ఎత్తివేయడం మంచి సాంప్రదాయం కాదని గట్టిగా వాదించాడు ముఖ్యమంత్రి. సాధారణ నేరాలకు సంబంధించిన చిల్లర కేసులను మాత్రమే ఎత్తివేశారు. అయితే, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడు, రాజ్యసభ సభ్యుడు కె.కేశవరావు నాయకత్వంలో తొమ్మిది మంది తెలంగాణ ఎమ్పీలు ఈ అంశంపై నిరాహార దీక్ష చేపట్టడం, ఒక్కరోజు తిరగకుండానే ప్రభుత్వం ఆ దీక్షకు తలవొగ్గి మొత్తం కేసులన్నిటినీ ఎత్తివేస్తున్నట్లు ప్రకటించడం నాటకీయంగా జరిగిపోయింది. శ్రీకృష్ణ కమిటీ నివేదిక వెలువడడానికి ఒకవారం ముందు ఈ రాజకీయ వీధి భాగోతం జరగడం గమనార్హం.

జమీన్‌రైతు

తెలంగాణ ఉద్యమం మొత్తాన్ని తన గుత్తసొత్తుగా మార్చుకోవడంలో టిఆర్ఎస్ అధినేత కెసిఆర్ సఫలీకృతుడు కావడం కాంగ్రెస్‌వాదులను కష్టపెడుతున్నది. తమలో తమకు సరైన పొత్తు కుదరక, అధిష్టానం నుంచి అనుమతులు లేక తెలంగాణ ఉద్యమంలో బాగా వెనుకబడి పోయారు వీరు. దాన్ని కెసిఆర్ తన అనుకూలతగా మార్చుకొన్నాడు. శ్రీకృష్ణ కమిటీ నివేదిక వచ్చిన తర్వాత ఒక ఉప్పెన వలె విరుచక పడనున్న ఉద్యమంలో తమ పాత్ర నామమాత్రమై పోతుందన్నది కాంగ్రెస్‌వాదుల భయం. అదే జరిగితే రేపటి ఎన్నికలలో తమకు పుట్టగతులు వుండవని, ఇప్పటికే అరవై ఏళ్లు దాటిన నాయకులంతా ఇక శాశ్వతంగా రాజకీయాల నుంచి విరమించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుందని భయం. ఆ ప్రమాదాన్ని తప్పించుకోవడానికి, ఏదో ఒక రకంగా తాము తెలంగాణ ఉద్యమంలో చురుకుగా వున్నామని చెప్పుకోవడానికి ఈ నిరాహార దీక్ష ఎత్తు వేశారు కాంగ్రెస్ ఎమ్పీలు. అధికార పార్టీకి చెందిన ప్రజాప్రతినిధులు తమ స్వంత ప్రభుత్వం పై ఒత్తిడి తేవడానికి నిరాహార దీక్షల మార్గం ఎంచుకోవడం అరుదైన విషయం. దీనివల్ల కాంగ్రెస్ పార్టీ పరువే పోయింది.

అయితే అధికార పార్టీ రాజకీయ అనుకూలత కోసం ఉద్యమకారులపై పెట్టిన కేసులన్నిటినీ మూసి వేయడం ఎంత వరకు సముచితమన్నది అసలు ప్రశ్న. ప్రజాందోళనలో పాలు పంచుకొన్న ఆందోళనకారుల మీద ఆ ఆందోళన సమసి పోయిన తర్వాత, కేసులు ఎత్తి వేయడం అప్పుడప్పుడు జరిగే ప్రక్రియ. అయితే అవి తీవ్రస్థాయి హింసతో కూడుకొన్నవైనప్పుడు, ప్రభుత్వం కొంత వెనుకా ముందు ఆలోచన చేయడం అవసరం. ఇప్పుడు ప్రభుత్వం ఎత్తివేసిన కేసుల్లో బస్సుల మీద రాళ్లు విసరడం, పెట్రోల్ పోసి తగలబెట్టడం, ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేయడం, వీధినపోయే వారి మీద రాళ్లు రువ్వడం, ఆత్మహత్య ప్రయత్నం చేయడం వంటి సంఘటనలున్నాయి. ఉద్యమం కోసం ఇటువంటి చర్యలకు పాల్పడడం ఎంత మాత్రం సమంజసం కాదు. అటువంటి హింసకు పాల్పడిన వారిని క్షమించి వదలి పెట్టడం ఒక చెడు సాంప్రదాయానికి నాంది అవుతుంది. ఈరోజు కాకుంటే రేపైనా ప్రభుత్వం తమ మీద కేసులు తొలగిస్తుందనే నమ్మకంతో భవిష్యత్తులో జరగబోయే ఉద్యమాలలో మరింత తీవ్రంగా హింసకు పాల్పడే ప్రమాదం వుంది. ఇప్పుడు తెలంగాణ ఉద్యమం మీద తీసుకొన్న ఈ నిర్ణయాన్ని తమకూ వర్తింప చేయాలని ప్రతి ఆందోళనకారుడూ ఒత్తిడి తెచ్చే అవకాశం వుంది. బంద్‌లు, హింసతో కూడుకొన్న ఆందోళనకు పాల్పడిన రాజకీయ పార్టీలను కూడా కఠినంగా శిక్షించాలని, ఆ సంఘటనల వల్ల జరిగిన నష్టాన్ని ఆ పార్టీల నుంచి వసూలు చేయాలని పలు హైకోర్టులు, చివరకు సుప్రీంకోర్టు కూడా ఆదేశాలిస్తున్న నేపథ్యంలో, ఉద్యమం పేరుతో హింసకు పాల్పడే వారిని బేషరతుగా విడిచి పెట్టడం ప్రభుత్వం చేయదగిన పని కాదు.

## జనవాణి

### సోనియాను చంద్రబాబు నిందించడమా?

మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు కాంగ్రెస్ పార్టీ జాతీయ అధ్యక్షురాలు శ్రీమతి సోనియాగాంధీని నీ బతుకు అవినీతిమయమని నిందించడం బాధ కల్గించింది. దేశం కోసం ప్రాణాలర్పించిన ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీల కుటుంబానికి ఆమె నిజమైన వారసురాలు. రెండుసార్లు ప్రధాని పదవిని త్యాగం చేసిన త్యాగమయి. దేశంలో అవినీతిని అంతమొందించే దిశగా ఆమె అలుపెరగని పోరాటం చేస్తున్నారు. చంద్రబాబులా రెండెకరాల పొలం నుంచి వేలకోట్లు సంపాదించలేదు. స్వంత పార్టీలోనే పట్టుకోల్పోతున్న బాబు ముందు ఆ వ్యవహారాలు సరిదిద్దుకొని ఆ తర్వాత ఇతరులను నిందిస్తే బాగుంటుంది.

ఎన్.జ్యోతి — కావలి

### సిఎంను చుట్టుముట్టిన సమస్యలు!

ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి పదవిని అధిష్టించి మాసం కాకపోయినా ఆయన్ను పలు సమస్యలు చుట్టుముట్టేశాయి. వీటి నుంచి ఆయన బయటపడడం కష్టంగా తోస్తుంది. ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటుపై శ్రీకృష్ణ కమిటీ ఇచ్చే నివేదిక తాలూకు ప్రకంపనలు తీవ్రంగా వుంటాయి. దీన్ని తప్పించుకొన్నా రైతు సమస్యలు, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల కోర్కెలు, ఆందోళనల్లో పాల్గొన్న విద్యార్థులపై కేసులు ఎత్తి వేయడం, స్పీకర్, పిసిసి అధ్యక్షుడు, డిప్యూటీ స్పీకర్ ఎన్నిక, జగన్ దాడి, మంత్రులలో అసంతృప్తి, ఖజానా నింపడం, అధిష్టానాన్ని సంతృప్తి పరచడం, విపక్షాలను ఎదుర్కోవడం మామూలు విషయమేమీ కాదు.

పి.అరుణకుమారి — నెల్లూరు

### గిరులపై తరుగుతున్న వృక్ష సంపద!

తిరుమల తిరుపతి దేవస్థానం వారి నినాదం వృక్షోరక్షతి రక్షితః. కానీ ఇది కేవలం బోర్డులకే పరిమితం కాబడింది. ఇటీవల తిరుమల కొండపైకి వెళ్లే మెట్ల మార్గంలో తరచూ చిరుత పులులు కనపడడం చూసేవారికి సాధారణ విషయమనిపిస్తుంది. లోతుగా ఆలోచిస్తే గిరులపై తరుగుతున్న వృక్ష సంపద కారణమని చెప్పక తప్పదు. ఈ విషయంపై టిటిడి ప్రత్యేక శ్రద్ధ పెట్టమనవి.

సి. హెచ్.సురేష్‌బాబు — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**10-1-1941**
**పేజీలు : 16 వెల: అణా**

(1941 జనవరి 3వ తేది వెలువడిన ప్రతి ఫైలు నుంచి అదృశ్యమై పోయింది. అదిప్పుడు అలభ్యం కూడా. అందువల్ల 10వ తేది సంచికలోని విశేషాలు ఇస్తున్నాం.)

– *సంపాదకుడు*

### రంధ్రాన్వేషి

మన తెలుగు పత్రికలు భాష విషయంలో తీసుకొనే స్వాతంత్ర్యం నియమబద్ధంగా లేకుండడం శోచనీయం. కొత్త రూపం, సాంప్రదాయాలు అవలంబించవచ్చునుగానీ, వున్న వాటిని చెరచడం బాగులేదని నా మనవి. సమిష్టిని సమిస్టి, యధార్థాన్ని యదార్దం, కథను కధ ఇట్లా వికారాలు చేయడం క్షంతవ్యం కాదు. ఈ తప్పులు చేయని పత్రిక లేదంటే అతిశయోక్తి కాదు.

వెంకట రాయశాస్త్రి గారి విజయ విలాస వ్యాఖ్యను చించి చెండాడిన పండితుడు తాపీ ధర్మారావు గారి 'కాగడా'లో గూడా ఇట్టి స్ఖాలిత్యాలున్నవంటే ఆశ్చర్యం. వీరి జన్మ సంచికలో సూర్యుని చిత్రం ఆరు గుర్రాలతో వేశారు. సూర్యుడు సప్తాశ్వుడు. కొందరి మతంలో సప్త ముఖాశ్వుడు. అనూరుడు లేకుండా సెల్ఫు డ్రైవింగ్ చేసే మన టౌన్‌హాలు కర్టన్ మీది సూర్యుడికి గూడా ఏడు గుర్రాలండీ!

***

ఒక సినిమా ఆయన "రామబ్రహ్మం గారి ఇల్లాలును పంపండి" అని వ్రాశాడట. వారి కంపెనీకే.

### ఆంధ్ర భీష్ముని అస్తమయం

న్యాపతి సుబ్బారావు గారు ప్రజాజీవిత నిర్వహణంలో పండు పడిపోయి కాలధర్మము నొందినారు. గొప్ప మేధావి, ఉత్తమ సంస్కారి, గొప్ప రాజకీయవేత్త. వీరి మరణం ఆంధ్రదేశానికేగాక యావద్భారత దేశానికి గూడా నష్టదాయకం.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**30-12-1960**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### ఆంధ్ర ఆస్థాన కవి అస్తమయం

ఆంధ్ర ఆస్థాన కవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు తన 95వ ఏట, 29వ తేది వేకువఝామున రాజమండ్రిలో అస్తమించారు.

శాస్త్రి ఆంధ్ర, గీర్వాణ భాషలలో గొప్ప పండితుడు; మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదములతో సన్మానింపబడినవారు. తన 16వ ఏట కవనం ప్రారంభించిన శాస్త్రి తెలుగులో దాదాపు 225 పుస్తకములను వ్రాసిన కవి సార్వభౌములు. భగవద్గీతను పద్య రూపంలో స్వతంత్ర రచన చేశారు. అష్టావధానము, శతావధానముతో తన పాండిత్య ప్రకర్షను చాటుకున్నారు. 1958లో రాష్ట్రపతిచే పద్మశ్రీ బిరుదముచే సత్కరింపబడినారు.

### పదివేల సభలు

భూదాన తపస్వి, రాజర్షి వినోబాభావే పది సంవత్సరాలలో పదివేల సభలలో ఉపన్యసించారట. రెండు కోట్ల 50 లక్షల మంది ప్రజలు ఆయన ఉపన్యాసాలు విన్నారట. కానీ వారి లక్ష్యమైన పది కోట్ల ఎకరాల భూ సేకరణ మాత్రం జరుగలేదు. అందువల్లనే భూములులేని వారికి భూములు పంచకపోతే దేశంలో హింసాత్మక విప్లవం వచ్చే ప్రమాదమున్నదని వారు హెచ్చరిస్తున్నారు.

### ముఖ్య వార్తలు

- మద్య నిషేధాన్ని అమలు జరిపే బాధ్యత ఫిబ్రవరి 1వ తేది నుండి ఎక్సైజ్ శాఖకు అప్పగించబడుతుందట.
- తిరుపతిలో విమానాశ్రయం నిర్మించమనే దేవస్థానం వారి విజ్ఞప్తిని కేంద్రం త్రోసిపుచ్చింది.

# నెల్లూరు ముచ్చట్లు

## జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా పితాని

జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ మంత్రి పితాని సత్యనారాయణను ప్రభుత్వం నియమించింది. పితాని సత్యనారాయణ పశ్చిమ గోదావరి జిల్లాకు చెందినవారు. మన జిల్లాకు చెందిన మంత్రి ఆనం రామనారాయణరెడ్డిని తూర్పుగోదావరి జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా నియమించారు. గతంలో జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా వుండిన మోపిదేవి వెంకటరమణ తనదైన ముద్రను జిల్లాపై వేయలేకపోయారు. పితాని ఏం చేస్తారో... వేచిచూడాల్సిందే!

## నెల్లూరు, సంగం బ్యారేజ్‌ల పరిశీలన

నెల్లూరు, సంగం బ్యారేజ్‌లను రాష్ట్ర ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి 26తేది పరిశీలించారు. ఈ రెండు బ్యారేజ్‌ల నిర్మాణాలకు 300కోట్ల రూపాయలు అవసరమని, జనవరి నెల నుంచి ఆగష్టు వరకు నెలనెలా కొంత మొత్తాలుగా 220కోట్లు విడుదల చేస్తానని, ఆ తర్వాత 80కోట్ల రూపాయలు ఒకేసారి విడుదల చేసి పనులు పూర్తయ్యేలా చూస్తామని హామి ఇచ్చారు. రైతులకు మంచి చేస్తామంటే వద్దనేదెవరు?



## రోడ్ల మరమ్మత్తులకు ఆరుకోట్లు!

లైలా తుఫాను కారణంగా నెల్లూరు నగరంలో దెబ్బతిన్న రోడ్ల మరమ్మత్తులకు రాష్ట్ర ప్రభుత్వం ఆరుకోట్ల రూపాయలను మంజూరు చేసింది. ఈ నిధులనైనా దుర్వినియోగ పర్చకుండా నగరంలోని రోడ్ల మరమ్మత్తులు సక్రమంగా చేస్తే జనం సంతోషిస్తారు.

## జర్నలిస్టుల సభల్లో రభస!

ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్ 33వ రాష్ట్ర మహాసభలు నెల్లూరులోని స్వర్ణవేదిక కళ్యాణ మండపంలో జరిగాయి. మూడురోజుల పాటు జరిగిన ఈ సభలకు లక్షల్లో ఖర్చు పెట్టారు. 25వ తేది మందెక్కువై గొడవ పడ్డ జర్నలిస్టులకు 26వతేది హ్యాంగ్ ఓవర్ తగ్గ లేదు కాబోలు మంత్రి రామనారాయణరెడ్డి మాట్లాడుతుండగా తెలంగాణ జర్నలిస్టు ఒకరు జై తెలంగాణ అనడంతో సీమాంధ్ర జర్నలిస్టులు సమైక్యాంధ్ర వర్ధిల్లాలనడంతో ఇరువర్గాలు నువ్వెంత... నువ్వెంత అని బాహాబాహికి దిగారు. వీరికి సర్ది చెప్పను మంత్రి, జంట ఎమ్మెల్యేలు, యూనియన్ నాయకులకు అరగంట పైగా పట్టింది. వాస్తవానికి ఎపిడబ్ల్యూజె అగ్ర నాయకులు శ్రీనివాస రెడ్డి, అమర్, సత్యనారాయణ, కృష్ణారెడ్డి, నరేంద్రరెడ్డి తెలంగాణ ప్రాంతీయులే. ఆంధ్రాకు చెందిన బలహీన జర్నలిస్టులైన సోమసుందరం, అంబటి ఆంజనేయులను ముందుపెట్టి పెత్తనమంతా వాళ్లే చలాయిస్తుంటారు. ఇప్పటికే తెలంగాణ జర్నలిస్టు ఫోరంకు ఆంధ్రజ్యోతి డిప్యూటీ ఎడిటర్ అల్లం నారాయణ వంటి వారు నాయకత్వం వహిస్తున్నారు. సీమాంధ్ర జర్నలిస్టులే పాపం ఎపిడబ్ల్యూజెకు ఊడిగం చేస్తూ పొద్దుపుచ్చుతున్నారు.

## సర్వే మరియు ల్యాండ్ రికార్డ్స్‌కు కొత్త భవనం!

జిల్లా సర్వే అండ్ ల్యాండ్ రికార్డ్స్ నూతన కార్యాలయ భవన నిర్మాణానికి 22 లక్షల 50వేల రూపాయలను ప్రభుత్వం మంజూరు చేసింది. నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయ ప్రాంగణంలో దీన్ని నిర్మిస్తారు. ఇప్పటివరకు ఈ కార్యాలయం పొగతోటలోని అద్దె భవనంలో నడుస్తోంది.

## వ్యవసాయంపై లోతుచర్చ జరగాలి

రాష్ట్రంలోని వ్యవసాయరంగ స్థితిగతులపై లోతైన చర్చ జరగాలని లోక్‌సత్తా పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు డాక్టర్ జయప్రకాష్ నారాయణ అభిప్రాయపడ్డారు. నెల్లూరులో జరిగిన జర్నలిస్టు సంఘం రాష్ట్ర మహాసభల్లో పాల్గొనను వచ్చిన ఆయన విలేకరులతో ప్రత్యేకంగా మాట్లాడారు. రాష్ట్రంలో వ్యవసాయ రంగం ఏళ్లతరబడి సంక్షోభంలో కూరుకపోయి వుంది. అధికారపార్టీ, ప్రతిపక్ష పార్టీలు ఈ విషయంపై లోతు చర్చ జరపకుండా రాజకీయ ప్రయోజనాల కోసం రైతులను వాడుకోవడం పట్ల జయప్రకాష్ నారాయణ ఆవేదన వ్యక్తం చేశారు.

## పాలరేట్ల పెంపు

విజయడైరీ 24తేది నుంచి వెన్న తీయని పాల రేట్లను పెంచింది. గతంలో లీటరు 32 రూపాయలుగా అమ్ముతుండిన ఈ పాలను 34 రూపాయలుగా చేసింది. మామూలు పాలప్యాకెట్ అర లీటరు రేటు 13 రూపాయలుగా వుంచామని డైరీ మేనేజింగ్ డైరెక్టర్ కృష్ణమోహన్ ఒక ప్రకటనలో స్పష్టం చేశారు.

## అభిమానులను పలకరించని ప్రభాస్!

యువహీరో ప్రభాస్ తన మిత్రుడి పెళ్లికి హాజరుకాను ఈ వారంలో నెల్లూరుకు వచ్చారు. సన్నిహైట్స్ హోటల్‌లో బస చేసిన ఆయన్ను అభిమానులు చూడను వెళ్లగా కరచాలనం చేయను కూడా ఇష్టపడక కారులో ఎక్కి తుర్రుమన్నారు. మొదటి నుంచి పబ్లిక్‌ను కలవను ప్రభాస్ ఇష్టపడడు. కారణమేమిటో?

## డిఆర్ ఆధ్యాత్మికసాయం

నెల్లూరు డిఆర్ ఉత్తమహోటల్ అధినేత కొడవలూరు ధనుంజయరెడ్డి పెంచలకోనలోని లక్ష్మీనరసింహస్వామి దేవస్థానంలో సుబిద మండప నిర్మాణానికి 10లక్షల రూపాయలు విరాళంగా ప్రకటించారు. అన్నదాన పథకానికి లక్షా 10 వేల 116 రూపాయలు అందించారు. శ్రీశైలంలోనూ మహాద్వార నిర్మాణానికి 25లక్షల రూపాయలు వెచ్చించినట్లు ధనుంజయరెడ్డి చెప్పారు. పెంచలకోన, శ్రీశైలం దేవస్థానాల పాలకవర్గ ఛైర్మన్లు అడిగిన మీదట ఈ సాయం చేశానన్నారు.

## బియిడి కళాశాలకు కరెంట్ కట్!

నెల్లూరు సంతపేటలోని బియిడి కాలేజి బకాయి వున్న 38వేల రూపా

కొరవ 14వ పేజీలో

• దబాయిస్తే అక్రమాలు సక్రమాలు కావు

# దర్గా దగ్గర తూక్‌మాలిష్ పనులు!

నెల్లూరు బారాషహీద్ దర్గా హుండీల్లోని మొత్తాలు ఊడ్చేసి ఈ ప్రాంగణంలో చేసిన తూక్‌మాలిష్ పనుల విషయమై 'జమీన్‌రైతు' ప్రస్తావిస్తే రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఉక్రోషంతో ఊగిపోయారు. పిచ్చి వాగుడు వాగారు. అభివృద్ధి పనుల కోసం దర్గా హుండీల్లోని డబ్బు 20 లక్షలే వినియోగించామని, ఎమ్మెల్యే నియోజకవర్గ అభివృద్ధి నిధులను నుంచి తాను ఐదు లక్షలిచ్చినట్లు గొప్పలు చెప్పుకొన్నారు. కానీ గత కొన్నేళ్లుగా నెల్లూరు ఎమ్మార్వో వద్ద డిపాజిట్ చేసిన హుండీల తాలుకు మొత్తం ఎంతో ఈనాటికీ ఆయన వెల్లడించలేదు. ఈ యేడాది రొట్టెల పండుగ సందర్భంగా హుండీల ఆదాయం 18 లక్షల రూపాయలొచ్చింది. అంటే హుండీల ఆదాయం ఏవిధంగా వుందో అర్థం చేసుకోవచ్చు. ఎమ్మెల్యే దర్గా వద్ద చేసినట్లు చెబుతున్న పనులన్నీ పనికిమాలినవే. ప్రస్తుతం వున్న మెయిన్ సిమెంట్ రోడ్డును ఆనుకొని ఆయన నిర్మింపచేసిన 15 మీటర్ల నిడివిగల సిమెంటు రోడ్డు, దర్గా తూర్పువైపు గోడకు చేసిన మరమ్మత్తులు, దర్గా లోపల వేసిన పాత గ్రానైటుకు ఖర్చు 25 లక్షలంటే విస్తుపోవాల్సిందే. దర్గా లోపల వేసిన పనికిమాలిన గ్రానైట్ మూలంగా లోపల


బారాషహీద్ దర్గా లోపల పరచిన పాత గ్రానైట్.

బారాషహీద్ల సమాధులు కళ తప్పాయి. ఈ విషయం దర్గా దగ్గరకు వెళ్లిన ఏ భక్తుడైనా సులభంగా తెలుసుకోగలడు. దర్గా దగ్గర వున్న చెరువు దగ్గర ప్లాట్‌ఫారాలు కట్టను టూరిజం శాఖ కోటిన్నరకు పైగా నిధులు విడుదల చేయగాలేనిది దర్గా దగ్గర భక్తుల విశ్రాంతికి శాశ్వత షెడ్లు, మరుగుదొడ్లు, స్నానగదుల నిర్మాణాలకు తిరుగులేని ఈ ఎమ్మెల్యే ప్రభుత్వం నుంచి నిధులు మంజూరు చేయించలేరా? ఈ పని చేయించలేక దర్గా దగ్గర హుండీలు వూడ్చి పెట్టి దాన్ని కప్పిపుచ్చును పెద్ద నోటితో అరిస్తే ఇక్కడ జరిగిన పనుల్లో అక్రమాలను మసిపూసి మారేడు కాయ చేయలేరు. రూరల్ ఎమ్మెల్యే తప్పు మీద తప్పు చేస్తూ పోతున్నాడు. తను చేస్తున్నది తప్పని ఆయన ఎప్పుడు తెలుసుకుంటాడో?


విజయవాడలో వైఎస్.జగన్ చేసిన లక్ష్యదీక్షలో పాల్గొని ఆయనకు మద్దతు తెలిపిన కర్నాటక తెలుగు యువజన సమాఖ్య ఉపాధ్యక్షుడు, నెల్లూరీయుడు ఓజిలి హర్షవర్ధన్‌రెడ్డి.


పినాకిని వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో బుజబుజనెల్లూరులోని స్కూల్ పిల్లలకు అట్టలు పంచుతున్న బాలభవన్ డైరక్టర్ సుభద్రాదేవి. ప్రక్కన టాక్స్ బార్ అసోసియేషన్ జిల్లా అధ్యక్షులు ఆర్వీ శేషయ్యనాయుడు.

## బొల్లినేని రామారావు దాతృత్వం

జిల్లాలో పేరొందిన కాంట్రాక్టర్‌గానేకాక పలు ఆలయాలను నిర్మించిన దాతగా బొల్లినేని వెంకటరామారావుకు పేరుంది. ఆయన క్రొత్తగా పలు గ్రామాల్లో దేవాలయాలు, విగ్రహాలకు విరాళాన్ని ప్రకటించాడు. పెదపాడు గ్రామంలో 25 లక్షల రూపాయలతో కళ్యాణ మండపాన్ని, పోలేరమ్మ గుడికి భారీమొత్తంలో విరాళాన్ని ప్రకటించాడు. సిద్దనకొండూరు గ్రామంలోని శివాలయంలో ధ్వజస్తంభం, పార్వతమ్మ గుడి నిర్మాణాన్ని చేపట్టారు. కొమ్మి గ్రామంలో రామాలయం, వీరబ్రహ్మేలయం, మద్దూరుపాడులో వినాయకుని గుడి నిర్మిస్తున్నారు. మహారాష్ట్రలో బెస్ట్ కాంట్రాక్టర్‌గా పేరు గడించిన రామారావు చేపడుతున్న నిర్మాణాలు, సేవలను పలువురు అభినందిస్తున్నారు.

● రాజకీయాల్లో

# విలువలు పతనం!

## బిజెపి నేత వెంకయ్యనాయుడు ఆవేదన



ప్రస్తుత రాజకీయాల్లో సిద్ధాంతాలు, ఆదర్శాలు తగ్గిపోతున్నాయని ధన ప్రభావం అన్నింటిని అధిగమిస్తోందని బిజెపి జాతీయ నాయకుడు ఎం.వెంకయ్యనాయుడు ఆవేదన వ్యక్తం చేశారు. బుచ్చిరెడ్డిపాళెంలో బిజెపి నేత రామిశెట్టి భాస్కర్‌రావు మృతి చెందడంతో వారి కుటుంబాన్ని పరామర్శించేందుకు వెంకయ్యనాయుడు బుచ్చికి విచ్చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అన్ని పార్టీలలో సిద్ధాంతాలు తగ్గిపోయి రాద్ధాంతాలు ఎక్కువవుతున్నాయన్నారు. ఏ నాయకుడు ఎప్పుడు ఏ పార్టీలో వుంటారో తెలియడం లేదని, అంతగా పార్టీలు మార్చేస్తున్నారని వ్యాఖ్యానించారు. పాత రోజులలో నేతలు కొన్ని విలువలు, సిద్ధాంతాలకు కట్టుబడి వుండేవారన్నారు. ప్రస్తుతం అవి కనుమరుగయ్యాయన్నారు. కలుషిత రాజకీయాల నుంచి బయటపడాలంటే సిద్ధాంత నిబద్ధత కల్గిన పార్టీలను ప్రోత్సహించాల్సిన అవసరం వుందన్నారు. రైతుల పరిస్థితి రోజురోజుకు దిగజారిపోతున్నదని, ప్రభుత్వాలు పట్టించుకోకపోవడంతో రైతులు వ్యవసాయం పట్ల విముఖత చూపుతున్నారని తెలిపారు. అదే జరిగితే దేశంలో ఆహారకొరత ఏర్పడే ప్రమాదం వుందన్నారు అనంతరం ఆయన భాస్కర్‌రావు కుటుంబ సభ్యులైన రమణమ్మ, మోహన్, మురళి తదితరులను పరామర్శించారు. ఆయన వెంట జిల్లా అధ్యక్షుడు ఆంజనేయ రెడ్డి, స్థానిక నాయకులు రఘురామయ్య, శ్రీనివాసులు, నరసింహులు పాల్గొన్నారు.

# కావలిలో కాంగ్రెస్‌కు కష్టాలు

## నియోజకవర్గ నేత కావాలి

కాంగ్రెస్ పార్టీకి కంచుకోటగా వున్న కావలిలో నేడు పార్టీ పరిస్థితి అగమ్యగోచరంగా వుంది. పార్టీని ముందుండి నడిపించే నాయకుడు కరువవడంతో కార్యకర్తలు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. కలికి యానాదిరెడ్డి కాలంలో కాంగ్రెస్ పార్టీ తిరుగులేని బలాన్ని కల్గివుండేది. తర్వాత మాగుంట పార్వతమ్మ కావలి శాసన సభ్యురాలిగా వున్నప్పుడు పార్టీ బలంగానే వుండింది. నియోజకవర్గాల పునర్విభజనలో అల్లూరు నియోజకవర్గం రద్దయి కావలిలో కలసిపోవడంతో చిక్కులొచ్చి పడ్డాయి. గత అసెంబ్లీ ఎన్నికల్లో పార్వతమ్మను కాదని విష్ణువర్ధన్ రెడ్డికి కావలి టిక్కెట్టు ఇవ్వడం తర్వాత ఆయన ఓటమి చవిచూడడం జరిగింది. ఈ పరిస్థితులలో రాజశేఖర్‌రెడ్డి మరణం తర్వాత జరిగిన పరిణామాలు, జగన్ కాంగ్రెస్ నుంచి బయటకు రావడంతో విష్ణువర్ధన్‌రెడ్డి జగన్ బాట పట్టారు. దీంతో కావలిలో ఎవరు తిరిగి నాయకత్వం వహిస్తారనే దానిపై అనుమానాలు తలెత్తుతున్నాయి. సహజంగా ఓడిపోయినవారే నియోజకవర్గ ఇన్‌ఛార్జీలుగా కొనసాగుతున్నారు. ఈ పరిస్థితులలో విష్ణు జగన్ వర్గం వైపు వెళ్లడంతో ఇప్పుడు పార్టీకి ఎవరు దిక్కనేది తేలాల్సి వుంది. ఇటీవల మంత్రి రామనారాయణరెడ్డి పార్వతమ్మను తిరిగి పార్టీ బాధ్యతలు చూడమని చెప్పినట్లు సమాచారం. ఆమె తిరిగి పూర్తిస్థాయిలో పార్టీ బాధ్యతలు చూస్తారో లేదో వేచి చూడాల్సి వుంది.

# జీతాలు లేక సిబ్బంది వెతలు!

## ఉదయగిరి ఎస్‌పిఎం ప్రాజెక్ట్ పరిస్థితిది.

ఉదయగిరి కేంద్రీయ సుస్థిర వ్యవసాయ ఎన్‌పిఎం ప్రాజెక్టు మండల కో ఆర్డినేటర్లకు ఆరు నెలలుగా జీతాలు చెల్లించకపోవడంతో వారి పరిస్థితి దయనీయంగా వుంది. జీతాల బకాయిలు పేరుకపోతున్నా పట్టించుకొనే వారు లేకపోవడంతో సిబ్బంది గోడుగోడు మంటున్నారు. ఒక్కో కో ఆర్డినేటర్‌కు 6370 రూపాయలు జీతంగా చెల్లిస్తారు. అలాంటిది ఆరు నెలల నుంచి జీతం రాకపోవడంతో కుటుంబాలను పోషించుకోలేక కోఆర్డినేటర్లు పడుతున్న కష్టాలు అన్ని ఇన్ని కావు. డిపిఎం దృష్టికి ఈ సమస్యను తీసుకొనివెళ్తే పని పాట లేని మీకు జీతాలు ఎందుకు దండగా అని వ్యాఖ్యానిస్తున్నారని సిబ్బంది వాపోతున్నారు. జూన్ నుంచి ఇంతవరకు ఒక్క రూపాయి జీతంగాని, టిఎ డిఎలు కాని ఇవ్వకపోవడంతో సిబ్బంది ఉద్యోగం చేయలేక, పస్తులుండలేక తీవ్రంగా ఇబ్బందులు పడుతున్నారు. సంబంధిత అధికారులు జోక్యం చేసుకొని ఆరు నెలలుగా బకాయి పడిన జీతాలు చెల్లించేలా చర్యలు తీసుకోవాల్సి వుంది.

# అనంతవరం చెరువుకు గండి పడి నాలుగేళ్లు!

## పూడ్చను తీరికలేనట్లుంది

చెరువుకు పడిన గండిని పూడ్చడంలో అధికారులు, ప్రజాప్రతినిధులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్న వైనం దగదర్తి మండలం అనంతవరం గ్రామంలో చోటు చేసుకొంది. ఇక్కడి చెరువుకు నాలుగు సంవత్సరాల క్రిందట గండిపడింది. ఈ గండిని పూడ్చాలని అప్పటి నుంచి రైతులు అధికారులు, ప్రజాప్రతినిధుల చుట్టూ ప్రదక్షిణ చేస్తున్నా ఫలితం లేకుండా పోయింది. 70ఎకరాల విస్తీర్ణంలగల చెరువు ఆయకట్టు క్రింద 200 ఎకరాలకు పైగా భూములు సాగుబడిలో వున్నాయి. చెరువు నీరంతా వృధాగా పోతోందని రైతులు మొరపెట్టుకొంటున్నా ఫలితం లేదు. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావును కలసిన గ్రామస్తులు చెరువు పరిస్థితిని వివరించగా ఆయన స్వయంగా పరిశీలించారు. ఇప్పటికి మూడుసార్లు చెరువుకు పడిన గండిని పరిశీలించినా చర్యలు మాత్రం శూన్యం అని రైతులు వాపోతున్నారు. హామీ ఇవ్వడం తప్పితే నిలబెట్టుకోవడం నేతలకు అలవాటు లేదన్న విషయాన్ని బిఎంఆర్ రుజువు చేస్తున్నారని గ్రామస్తులు వ్యాఖ్యానిస్తున్నారు.

## వెంకటగిరి రాజా పదరాగిణి ట్రస్ట్

### ప్రాచీన గేయ సంపద పదిల పరచడమే లక్ష్యమట

ప్రాచీన గేయ సంపదను పదిలపరచి వాటిని ధ్వనిముద్రణ ద్వారా తెలుగువారికి అందుబాటులోకి తీసుకొని వచ్చేందుకు పదరాగిణి ట్రస్టును ప్రారంభిస్తున్నట్లు సంగీత గేయధార సృష్టికర్త డాక్టర్ విబి.సాయికృష్ణ యాచేంద్ర తెలిపారు. ట్రస్టు ప్రారంభం సందర్భంగా రాజ భవనంలో జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ తెలుగువారే కాకుండా ఇతర రాష్ట్రాల వారు పలు తెలుగు గేయాలను రచించి వున్నారని తెలిపారు. గేయధారను ప్రారంభించి 20సంవత్సరాలు గడిచాయని, ఇప్పటివరకు 350 ప్రదర్శనలు ఇచ్చినట్లు చెప్పారు. ఆసక్తి గల వారికి గేయధార ప్రక్రియను నేర్పించడమేగాక, ఉపకార వేతనాన్ని అందిస్తామని ప్రకటించారు. ప్రాచీన గేయ సంపదకు నిధిగా వెంకటగిరిని తయారు చేస్తామని ప్రకటించారు. ఈ కార్యక్రమంలో పరిశోధకుడు డాక్టర్ కృష్ణమూర్తి, సంగీత విద్యాంసుడు సురేష్‌రావు తదితరులు పాల్గొన్నారు.

## అమ్మమ్మ చేసిన అప్పుకు మనవడి వెట్టి

### నాయుడుపేటలో వెలుగుచూసిన దారుణం

అమ్మమ్మ అప్పు తీర్చలేదని మనవడి చేత వెట్టిచాకిరి చేయిస్తున్న దారుణ ఘటన నాయుడుపేటలో జరిగింది. స్థానిక మాంసం దుకాణంలో బోడెద్దుల చెంగయ్య అనే బాలుడు గత ఎనిమిదేళ్లుగా పని చేస్తున్నాడు. ఈ బాలుడు చేసిన పాపం అతని అమ్మమ్మ అప్పు తీసుకోవడం. నాగమ్మ అనే ఆమె యజమాని వద్ద రెండువేల రూపాయలు అప్పు తీసుకొంది. ఆ అప్పు తీరడం కోసం యజమాని ఆమె మనుమడైన చెంగయ్యను పనిలో పెట్టుకొని వెట్టిచాకిరి చేయిస్తున్నాడట. ఆలస్యంగా ఈ విషయం ఆనోట ఈనోట బయటకు రావడంతో లేబర్ ఇన్స్‌పెక్టర్ సురేష్ ఆ షాపును తనిఖీ చేసి వెట్టి చాకిరి నుంచి బాలుడికి విముక్తి కల్పించాడు. తనకు అందరి పిల్లల్లా చదువుకోవాలని వుందని చెప్పడంతో ఆ పిల్లవాడిని బాల కార్మికుల సంక్షేమ కేంద్రానికి పంపించారు అధికారులు.

● కురుగొండ్లకు

## కోపమొచ్చింది!



వెంకటగిరి నియోజకవర్గంలో జరిగే అభివృద్ధి పనులు, ఇతరత్రా విషయాలపై స్థానిక ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, అధికారుల మధ్య వివాదం రేగింది. బాలాయపల్లి తహశీల్దార్ కార్యాలయం అందుకు వేదిక అయ్యింది. ఆర్‌డిఓ అధ్యక్షతన జరిగిన రెవెన్యూ సమీక్షా సమావేశానికి ఎమ్మెల్యే కురుగొండ్ల హాజరయ్యారు. పట్టణంలో వీధి దీపాలు, పారిశుద్ధ్యం, త్రాగునీరు వంటి అంశాలపై అధికారులు దృష్టి సారించడం లేదని రామకృష్ణ ఆగ్రహించారు. వెంకటగిరి పట్టణంలో పరిస్థితి మరీ దారుణంగా వుందని, కమిషనర్, ఎఇ వంటి అధికారులు తరచూ హైదరాబాద్ వెళ్తుండడంతో ప్రజల సమస్యలు పట్టించుకొనేవారే లేకుండా పోయారన్నారు.

### కమిషనర్‌పై కస్సు బుస్సు

దీనికి స్పందించిన కమిషనర్ ఎమ్మెల్యే వ్యాఖ్యలను తప్పుపట్టారు. ఉన్నతాధికారుల ఆదేశాల మేరకే హైదరాబాద్ వెళ్తున్నాం తప్ప సొంత పనులకు కాదన్నారు. వెంకటగిరిలో నివాసం వుండి పురపాలక అభివృద్ధికి కృషి చేస్తున్న తమపై అలాంటి వ్యాఖ్యలు చేయడం బాధాకరం అన్నారు. మీకు ఇష్టం లేకపోతే చెప్పండి సెలవుపెట్టి పోతామని అనడంతో సమావేశంలో గందరగోళం నెలకొనింది.

## మేట్రిన్ కాదు రాక్షసి

### బుచ్చి హాస్టల్‌లో అన్నమడిగితే చావగొట్టింది.

అన్నం చాలడం లేదని అడిగినందుకు విద్యార్థిని చావబాదిన ఘటన బుచ్చిరెడ్డిపాళెంలో చోటు చేసుకొంది. ప్రకాశం జిల్లాకు చెందిన రాధ, అనిత అనే అక్కచెల్లెల్లు బుచ్చి పెద్దూరులో గల బిసి బాలికల హాస్టల్‌లో వుండి చదువుకొంటున్నారు. అయితే హాస్టల్‌లో విద్యార్థులకు తగినంత ఆహారం అందజేయడం లేదు. దీనిపై రాధ అనే విద్యార్థిని హాస్టల్ మేట్రిన్‌ను అన్నం చాలడం లేదు కొంచెం పెట్టించండి అని అడిగిందట. పిల్లలు నోరుకొట్టి జేబులు నింపుకొనేందుకు అలవాటు పడ్డ ఆ మేట్రిన్ నాగభూషణమ్మ రాధను గొడ్డును బాదినట్లు బాదిందట. ఆ దెబ్బలు తాళలేని చిన్నారి జ్వరంతో మంచం పట్టింది. ఎవరూ పట్టించుకోకపోవడంతో తల్లిదండ్రులకు సమాచారం అందించడంతో విషయం బయటపడింది. విద్యార్థినిని మేట్రిన్ కొట్టిన సంగతి గగ్గోలు రేగడంతో హడావిడిగా అధికారులు ఆ బాలికకు వైద్య పరీక్షలు చేయించి చేతులు దులుపుకొన్నారు. జిల్లా ఉన్నతాధికారులు దీనిపై విచారణ జరిపించి హాస్టల్ బాలికలకు సక్రమంగా ఆహారం అందేలా చూడడంతోపాటు విద్యార్థినిని చావగొట్టిన మేట్రిన్‌పై చర్యలు తీసుకోవాలని గ్రామస్తులు కోరుతున్నారు.

● కావలి

## సినిమాహాళ్లు ఘోరం!

### పాపం... ప్రేక్షకులు

కావలి పట్టణంలో సినిమాహాళ్ల పరిస్థితి ఘోరంగా వుంది. లాభార్జనే తప్ప ప్రేక్షకులకు కనీసపాటి సౌకర్యాలు కల్పించాలన్న ఉద్దేశ్యం థియేటర్ల యాజమాన్యాలకు లేకపోవడంతో సినిమా చూసేందుకు వెళ్లే సగటు ప్రేక్షకులు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. పట్టణంలో ఆరు సినిమాహాళ్లు వున్నాయి. చుట్టుప్రక్కల 52 గ్రామాల ప్రజలు సినిమా చూసేందుకు కావలి పట్టణానికి విచ్చేస్తుంటారు. ఈ పరిస్థితుల్లో సినిమాహాళ్లలో పరిశుభ్రంగా వుంచాల్సి వుండగా ఏ ఒక్కరూ దాని గురించి పట్టించుకోకపోవడంతో ప్రేక్షకులకు తిప్పలు తప్పడం లేదు. సరిగాలేని సీట్లు, దీనికి తోడు నల్లుల బాధ, అపరిశుభ్రంగా వున్న టాయిలెట్లు సినిమా హాళ్ల పరిస్థితిని తెలియజేస్తున్నాయి. ఏసి థియేటర్లు వున్నా టిక్కెట్ ధర వసూలు చేసుకొనేందుకే తప్ప ఏసి సౌకర్యం సక్రమంగా అందుబాటులో వుండడం లేదు. సినిమా ప్రారంభమైన కొద్దిసేపటికే ఏసి నిలిపి వేస్తున్నారని ప్రేక్షకులు ఆరోపిస్తున్నారు. క్రొత్త సినిమాలు, ముఖ్యంగా క్రేజ్ వున్న హీరోల సినిమాలు విడుదలైనప్పుడు అధికంగా షోలు వేయడం, బ్లాక్‌టిక్కెట్ల విక్రయాలు విచ్చలవిడిగా జరుగుతున్నాయి. సినిమాహాళ్ల స్థితిగతులు, కనీస సౌకర్యాలు కల్పిస్తున్నాయో లేదో పరిశీలించాల్సిన అధికారులు ఆ వైపు తొంగిచూడకపోవడంతో కావలి పట్టణ సినిమా హాళ్ల పరిస్థితి దారుణంగా వుంది.

## విద్యుత్‌సరఫరాను మెరుగుపరుస్తాం!

### సిఎండి వారణాసి కృష్ణమూర్తి వెల్లడి

జిల్లాలో మెరుగైన విద్యుత్ సరఫరా కోసం 167కోట్ల రూపాయలతో హైఓల్టేజ్ డిస్ట్రిబ్యూషన్ సిస్టంను ఏర్పాటు చేస్తున్నట్లు ఎస్‌పిడిసిఎల్ సిఎండి వారణాసి కృష్ణమూర్తి తెలిపారు. ఇటీవల నెల్లూరు విచ్చేసిన ఆయన విద్యుత్ సౌకర్యాల మెరుగు కోసం చేపడుతున్న చర్యలను వివరించారు. వెంకటాచలం మండలంలో ఈ పద్ధతిని అమలు చేస్తున్నామన్నారు. ఈ పద్ధతి వల్ల ఇకపై గ్రామీణ ప్రాంతాల్లోని వారికి 24గంటలు, వ్యవసాయరంగానికి ఏడుగంటలపాటు నిరంతరాయంగా విద్యుత్ సరఫరా అందించే వీలు కల్గుతుందన్నారు. త్వరలో జిల్లావ్యాప్తంగా అమలు చేసేందుకు చర్యలు తీసుకొంటున్నట్లు వివరించారు. వివిధ గ్రామాలు, పట్టణాల్లో విద్యుత్ వినియోగదారులు ఎదుర్కొంటున్న ఓల్టేజ్ సమస్యలను అధిగమించేందుకు 26 కొత్త సబ్‌సేషన్ల ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ప్రతి నాలుగు మోటార్లకు ఒక ట్రాన్స్‌ఫార్మర్ ఏర్పాటు చేస్తామని, దీని వలన ట్రాన్స్‌ఫార్మర్లపై అదనపు భారం పడదన్నారు. కరువు ప్రాంతాల్లో 8కోట్లతో క్రొత్తగా సబ్‌స్టేషన్ల ఏర్పాటుకు ప్రతిపాదనలు పంపామన్నారు. ఇవేగాక మరో 39 సబ్‌స్టేషన్లను ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. నగరంలోని శివారు ప్రాంతాలకు త్రీఫేస్ విద్యుత్ సౌకర్యాన్ని అందజేయనున్నట్లు వివరించారు. జిల్లాలో విద్యుత్ బకాయిలు 54.77 కోట్లు వున్నాయని, వీటి రికవరీ కోసం ప్రత్యేక చర్యలు తీసుకొంటున్నట్లు చెప్పారు. విద్యుత్ చౌర్యాన్ని ఉపేక్షించమన్నారు.

# అభివృద్ధి పథంలో నెల్లూరు నగరపాలక సంస్థ












## అభివృద్ధి కార్యక్రమాలు

- 122 కోట్లతో సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్ ఏర్పాటు (నగరానికి శాశ్వత త్రాగునీటి సమస్య పరిష్కారం)
- 60కోట్లు జనరల్ నిధులతో నగరంలో మౌలిక సదుపాయాలు.
- 12వ ఆర్థిక సంఘం నిధులు 9.56కోట్లతో పారిశుద్ధ్యం అభివృద్ధి పనులు.
- 6కోట్లతో 7వాటర్ ట్యాంక్‌ల నిర్మాణానికి శ్రీకారం.
- లైలా వరద నిధులు 6.20 కోట్లతో మౌలిక సదుపాయాలు.
- 18 కోట్లతో లింకురోడ్ల అభివృద్ధి
- 19 కోట్ల డి.ఎఫ్.ఐ.డి. నిధులతో మురికివాడల అభివృద్ధి.
- 1700కోట్లతో భూగర్భ, వరద, డ్రైనేజ, మురికివాడల అభివృద్ధి, త్రాగునీటిపైపుల ఆధునీకరణ, పేదల వాడల అభివృద్ధికి ప్రతిపాదనలు.
- పారిశుద్ధ్యం అభివృద్ధికి ప్రయోగాత్మకంగా కొన్ని డివిజనులలో ఇంటి నుంచి చెత్త స్వీకరించే కార్యక్రమం.
- 5కోట్లతో నగర తూర్పుప్రాంత ప్రజలకు పెన్నా నీటిని అందించే రాజీవ్ త్రాగునీటి పథకం అమలు.
- రాజీవ్ నగర బాట నిధులు 5.5కోట్లతో రోడ్లు, కాలువలు అభివృద్ధి.
- 10 కోట్లతో నగరపాలక సంస్థ నూతన భవనం ఏర్పాటు.
- ఇందిరమ్మ పథకం ద్వారా 15 వేల మందికి పింఛన్లు.





టి.సీతారామయ్య
అడిషనల్ జాయింట్ కలెక్టర్ మరియు
స్పెషల్ ఆఫీసర్, నగరపాలక సంస్థ.

**నగరపాలక సంస్థ నెల్లూరు.**

డా॥ టి.ఎస్.ఆర్. ఆంజనేయులు
కమిషనర్



## వెంకయ్య ఆదర్శం



భారతీయ జనతా పార్టీ అగ్రనాయకునిగా వెలుగొందుతున్న ముప్పవరపు వెంకయ్యనాయుడుకి స్వంత జిల్లా నెల్లూరు అంటే ప్రత్యేకాభిమానం. కేంద్ర గ్రామీణాభివృద్ధి మంత్రిగా పని చేసే సమయంలో జిల్లాలో వివిధ కార్యక్రమాలు చేపట్టను కోట్లాది రూపాయల నిధులు మంజూరు చేయించాడు. ప్రతి నెలా స్వర్ణభారత్ ట్రస్ట్ నేతృత్వంలో ఏదో ఒక సేవా కార్యక్రమం ఏర్పాటుచేసి వాటికి వెంకయ్య హాజరవుతుంటారు. వెంకయ్యకు జిల్లాలో లెక్కలేనన్ని సన్మానాలు జరిగాయి. ఈ సందర్భంగా ఆయన అభిమానులు వేలాది శాలువాలు కప్పారు. వీటన్నింటిని భద్రపరచిన వెంకయ్య ఈ వారంలో వాటిని నెల్లూరు నగరంలోని రైల్వే, బస్‌స్టేషన్లు, దేవాలయాలు, పేవ్‌మెంట్ల మీద తలదాచుకొంటున్న పేదలకు తన అనుచరుల చేత పంపిణీ చేయించారు. మంచి చలి కాలంలో విలువైన శాలువాలు దక్కడంతో వీటిని పొందినవారి కళ్లలో మెరుపులు మెరిశాయి.





# సర్వ శిక్షా అభియాన్



## అందరూ చదవాలి - అందరూ ఎదగాలి

# రాజీవ్ విద్యామిషన్

### శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా

- పాఠశాలలో మౌళిక వసతుల కల్పనలో భాగంగా అవసరమైన పాఠశాలలకు అదనపు తరగతి గదుల నిర్మాణము చేయుట. 2007 -08 సంవత్సరము నందు 280, 2008 - 09 సంవత్సరము నందు 580, 2009 - 10 సంవత్సరము నందు 100 తరగతి గదులు మంజూరు కాబడి నిర్మించడం జరిగినది. 2010 - 11 సంవత్సరము నకు 354 అదనపు తరగతి గదులు, 349 టాయిలెట్‌లు, 17 పాఠశాలలకు త్రాగునీటి వసతి, 50 పాఠశాలలకు ర్యాంపు మరియు రెయిలింగ్ మంజూరు కాబడియున్నది.
- గుణాత్మక విద్యను అందించడంలో భాగంగా పాఠశాలలలో ఉపాధ్యాయుల కొరతను నివారించుటకు 2858 మంది విద్యావాలంటీర్ల నియామకం మరియు ఉపాధ్యాయులక వృత్యంతర శిక్షణా కార్యక్రమములు నిర్వహించటం.
- పాఠశాలల్లో వినూత్న కార్యక్రమాలు, పోస్టు బాక్సు, గోడ పత్రిక, అభ్యాసనాభివృద్ధి కార్యక్రమాలు(LEP) నిర్వహించుట.
- బడి బయటి పిల్లలను పాఠశాలల్లో చేర్పించుటకు 32 స్పెషల్ ట్రైనింగ్ సెంటర్లు (రెసిడెన్షియల్ మరియు నాన్ రెసిడెన్షియల్ పద్ధతిలో) దూర ప్రాంతపు హాబిటేషన్ల విద్యార్థులకు ఆటో రిక్షా ట్రాన్స్‌పోర్టు సౌకర్యము, ట్రాన్సిట్ హోమ్స్, 8 వర్క్‌సైట్ పాఠశాలలు ఏర్పాటు చేయుట
- పాఠశాలల్లో విద్యా ప్రమాణాలు పెంపొందించుటలో ప్రజల భాగస్వామ్యం కల్పించడంతోపాటు అకడమిక్ మానిటరింగ్ కమిటీలను సర్పంచ్ అధ్యక్షతన ఏర్పాటుచేసి ప్రతి నెలా సమావేశాలను ఏర్పాటుచేసి విద్యార్థుల ప్రగతిని, పాఠశాల నిర్వహణ, నిధుల వినియోగం, మధ్యాహ్న భోజన పథకము పర్యవేక్షించుట.
- సార్వజనీన ప్రాథమిక విద్యను సాధించుటలో భాగంగా ప్రత్యేక అవసరాలు గల పిల్లలకు ఇంటి వద్దనే విద్యనందించే కార్యక్రమంలో భాగంగా రిసోర్సు ఉపాధ్యాయులను నియమించడం, పిల్లలకు అవసరమైన ఉపకరణములు(రెండు చక్రాల బండ్లు, మూడు చక్రాల బండ్లు, వినికిడి యంత్రాలు, ఊత కర్రలు మొదలైనవి) అందజేయుట, మండల కేంద్రాలలో ఫిజియో థెరపీ సేవలు నిర్వహించుట.
- బాలికా విద్యను ప్రోత్సహించుటలో భాగంగా 7 కస్తూర్బా గాంధీ బాలికా విద్యాలయాలు ఏర్పాటు మరియు NPEGEL పథకము క్రింద 56 మోడల్ క్లస్టర్ పాఠశాలల్లోని బాలికలకు కుట్లు, అల్లికలు, ఎంబ్రాయిడరీ, పెయింటింగ్, చేతి పనుల యందు శిక్షణా కార్యక్రమాలను నిర్వహించుట.



**ఆర్.బాలాజీరావు** ఎం.ఎస్.సి., ఎం.ఇడి
ప్రాజెక్టు అధికారి (ఎఫ్.ఏ.సి) రాజీవ్ విద్యామిషన్, నెల్లూరు.



**కె.రాంగోపాల్** ఐ.ఏ.ఎస్
జిల్లా కలెక్టర్ మరియు వైస్ చైర్మన్ రాజీవ్ విద్యామిషన్, నెల్లూరు.



# వారఫలాలు

తేది 1-1-2011 నుండి 7-1-2011 వరకు ధనుస్సులో రవి, కుజ, రాహువులు; వృశ్చికంలో బుధుడు, తుల, వృశ్చికాలలో శుక్రుడు; మీనంలో గురువు; కన్యలో శని; మిథునంలో కేతువు; వృశ్చిక, ధనుర్మకరాల్లో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

వ్యవహార జయం, ఆరోగ్యసిద్ధి, అనుకూల ప్రయాణాలు కలుగుతాయి. స్త్రీలు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించాలి. వ్యాపారులకు మొదట అంతంతమాత్రంగానే ఉన్నా తర్వాత లాభాలు వస్తాయి. వారం మొదట్లో ధనలాభం, కొత్తవారితో పరిచయాలు. సహనం, సంయమనం అవసరం. కుటుంబ సభ్యులతో చిన్నపాటి మాట పట్టింపులు, అభిప్రాయ భేదాలు కలుగుతాయి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

వారం మొదట్లో ప్రతి అంశంలోనూ ఆచితూచి ముందడుగు వేయండి. ఇతరుల వల్ల మోసపోయే సూచనలున్నాయి. ఆర్థికంగా లోటుండదు. పనుల్లో జాప్యం కలుగుతుంది. శుభకార్య యత్నాలు మొదలు పెట్టడానికి అనుకూల సమయం. విద్యార్థులు బద్ధకం తగ్గించుకొంటే సఫలత కలుగుతుంది. అనాలోచితంగా తీసుకొనే తొందరపాటు నిర్ణయాల వల్ల భవిష్యత్తులో ఇబ్బందులెదుర్కొంటారు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

కళత్ర సౌఖ్యం, మానసికానందం కలుగుతాయి. సోదర వర్గ బలం మీకు బాగా కలిసివస్తుంది. పరోపకార తత్వంతో మెలుగుతారు. నమ్మిన అనుచరులే మీకు వెన్నుపోటు పొడిచే ప్రమాదముంది. మెలుకువగా వ్యవహరించండి. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలిస్తాయి. రాజకీయ నాయకులు అసంతృప్తి, అసహనంతో ఉంటారు. జాగ్రత్త వహించండి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం ఉన్నా తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేతమవుతాయి. సంతాన విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం కూడా ఉంది.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

తల పెట్టిన పనులు పూర్తవుతాయి. దైవక్షేత్ర సందర్శన సూచితమవుతున్నాయి. మీ మాటకు విలువ, గౌరవం పెరుగుతాయి. సాహస కార్య నిర్వహణ ఫలిస్తుంది. కళాకారులకు ప్రోత్సాహం. వాదాల్లో జయం మీదే. కొత్త వారితో పరిచయాలవుతాయి. సరదా కాలక్షేపాలుంటాయి. అవివాహితులకు శుభవార్తాశ్రవణం. అయితే ప్రతి పనిలోనూ చివరి వరకూ ఉత్కంఠ, ఆందోళన, క్షోభ నెలకొంటాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్త 1, 2 పా

ఆహార సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా ఉంటారు. క్రయవిక్రయాలు మీకనుకూలంగా జరుగుతాయి. కళాకారులకు, ప్రముఖులకు శుభ వార్తలందుతాయి. విద్యార్థులకు మంచి కాలం. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలో పడుతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు.

## పంచాంగం

**శుభ ముహూర్తాలు లేవు**

**జనవరి తిథులు**

**మార్గశిర బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | శని | ద్వాదశి | మ.3.02 | గం.ల.వ |
| 2 | ఆది | త్రయోదశి | మ.2.26 | గం.ల.వ |
| 3 | సోమ | చతుర్దశి | మ.2.14 | గం.ల.వ |
| 4 | మంగళ | అమావాస్య | మ.2.30 | గం.ల.వ |
| | | **పుష్య శుద్ధ** | | |
| 5 | బుధ | పాడ్యమి | సా.3.14 | గం.ల.వ |
| 6 | గురు | విదియ | సా.4.29 | గం.ల.వ |
| 7 | శుక్ర | తదియ | సా.6.12 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల**
చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం ఉంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం ఉండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. తలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే సూచనలున్నాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

స్వల్ప మార్పు చేర్పులతో కార్యసిద్ధి, ముఖ్యమైన వ్యవహారాల్లో గోప్యత పాటించండి. బిడియాన్ని వీడి చొరవగా దూసుకుపోండి. ప్రయాణాలు తాత్కాలికంగా వాయిదా వేస్తేనే మంచిది. సుఖసంతోషాలతో కాలక్షేపం చేస్తారు. వ్యవహార జయం, కొన్ని వ్యవహారాలలో మధ్యలో ఆటంకాలు ఎదురయినా ధైర్యంతో పట్టుదలగా వ్యవహరించి చివరకు జయం పొందుతారు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సాహమిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. బంధువుల నడుమ మన్ననల ప్రాప్తికి అవకాశాలు. సంతానానికి సంబంధించిన విషయాల్లో అతిశ్రద్ధ, ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొంటారు. దైవపూజా కార్యక్రమాలలో పాలు పంచుకొంటారు. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

సాహసంతో చేపట్టిన పనుల్లో లాభం పొందుతారు. మాటతొందర కారణంగా ఇతరులతో మాటపడుతారు. శుభకార్యాల నిమిత్తం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు వృద్ధి, ఉద్యోగులకు అనుకూల సమయం. ఇంటి విషయాలు పట్టించుకోకపోయినా సాంఘిక కార్యక్రమాల్లో క్రియాశీల పాత్ర పోషిస్తారు. ఆర్థికరంగంలోని వారికి కొన్ని సందర్భాలలో ఆశాభంగం, నిరుత్సాహం ఎదురౌతాయి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

అనవసర ఆలోచనలతో మనసు గజిబిజిగా ఉంటుంది. పాత మిత్రులు కలుస్తారు. చిరకాలంగా నిలిచిపోయిన బాకీలు కొద్దిపాటి నష్టాలతోనైనా వసూలవుతాయి. ఆదాయ, వ్యయాలు సమపాళ్ళలో ఉంటాయి. ఉద్యోగులకూ, విద్యార్థులకు ఒకింత పరీక్షా కాలమైనప్పటికీ ప్రతిభ, ఆలోచనాశక్తితో ముందడుగు వేస్తారు. ఇంటర్వ్యూలలో గట్టి పోటీ ఎదురౌతుంది. కష్టానికి తగిన సత్ఫలితాన్ని ఆశించవచ్చు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

వ్యవహారాల్లో మెలకువ అత్యవసరం. స్థిరాస్తి సంబంధ ఆలోచనలు భవిష్యత్తులో ఫలిస్తాయి. కొత్త వస్తువులు కొనుగోలుచేయడానికి ఆసక్తి చూపుతారు. ఆలోచనా విధానం సరిగా లేకపోవడం వల్ల, బద్ధకం కారణంగా ముఖ్యమైన పనులు వాయిదా వేయడం వల్ల అనూహ్య ఇబ్బందులెదురవుతాయి. ఉద్యోగులకు పై అధికారుల నుంచి ఒత్తిళ్ళు అధికంగా ఉంటాయి.

# వాస్తును ఒకేసారి సరిచేసుకోవాలి!

*కె.ఆర్.వాసంతిరెడ్డి — చెన్నై*

* *వాస్తు ఎన్నిసార్లు సరిచేసుకున్నా పరిస్థితులు మారట్లేదు.*

వాస్తు ఒకేసారి సరిచేసుకోవాలి. పలుసార్లు చేయవలసిన అవసరమేమిటి? సిద్ధాంతుల్ని మారుస్తున్నారా? సిద్ధాంతి ప్రావీణ్యం వున్న వ్యక్తికాదా?

*బి.అరుణారావు — విజయవాడ*

* *వాస్తు ప్లాను, జాతకాలు పంపిస్తున్నాను. పరిష్కారం చెప్పండి.*

మీ సుదీర్ఘ ఉత్తరాన్ని ఓ వాస్తు శాస్త్రవేత్తగా చదివాక మీ అనుమానాలన్నీ అర్థం లేనివిగా కనిపిస్తున్నాయి. కొంతకాలం మీ అత్తగారిని తీర్థ యాత్రలకు వెళ్లేలా ఏర్పాట్లు చేయండి. మీ మానసిక పరిస్థితి కుదుట పడుతుంది.

*పి.శ్రీనివాసాచారి — వెంకటగిరి*

* *దక్షిణ, పశ్చిమ దిశలలో ఇంటికి పంట కాలువలున్నాయి. దోషమా? ఏం చేయాలి?*

దిశావేధ కలిగి అనారోగ్యం, ఆర్థిక భంగాలేర్పడుతాయి. ఈశాన్య కుంభ ప్రతిష్ట దోషాల్ని తొలగిస్తుంది.

*దేవి సుబ్బారావు — అనంతపురం*

* *బాడుగ యిళ్లలో సమస్యలకు ఏమి చేయాలి?*

వాస్తు లోపాలు సరిచేసుకోలేని పరిస్థితులలో సంబంధిత యంత్ర ప్రతిష్ట తప్పనిసరిగా చేసుకోవాలి.

*ఎం.సుజాతారెడ్డి — కర్నూలు*

* *రంగుల ప్రభావాలుంటాయని మీరు చెప్పిన సమాధానం చదివాక అర్థమయింది.*

గాఢమైన రంగులు 'దిష్టివేధ' కలుగజేస్తాయి. బెడ్‌రూంలోని ఎర్రటి బెడ్‌లాంప్ తీసివేసి బ్లూ, పసుపు, పచ్చరంగులు బల్బులు వాడండి. కలత నిద్రలుండవు.

*ఎం.టి.ఆర్ — హైదరాబాద్*

* *ఇప్పటికి మూడు ఆస్పత్రులు మార్చాను. ఒక ఆపరేషన్ వికటించి చాలా చెడ్డ పేరు వచ్చింది.*

మీరున్న గృహంలో చాలా వాస్తు దోషాలున్నాయి. మీకు పశ్చిమం సింహద్వారం గల భవనాలు కలిసి వస్తాయి.

*కె.రేణుకాదేవి — కావలి*

* *వాయువ్యం సెప్టిక్ ట్యాంకు మార్చాక చాలా మానసిక ఒత్తిళ్లు తగ్గాయి.*

నాలుగు మూలల్లోనూ ఎట్లాంటి అగాధాలూ వుండకూడదు. అలా వుండబట్టే వాయువ్యం దోషం మిమ్మల్ని కోర్టు వ్యాజ్యాల వరకూ లాక్కు వెళ్లింది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*శ్రీపతి గంగాధరం — చిత్తూరు*

* *చింతతోపు వున్నది. దుష్టశక్తుల సందడి గమనిస్తున్నాం. దీనికి విరుగుడు ఏమిటి?*

తోపులోని కాపలా నివాసపు గుడిసెలో 'సుదర్శన యంత్రం' ప్రతిష్టించి సున్నం పసుపు కలిపిన మంత్ర జలం తోపు హద్దుల్లో చల్లించండి.

*ఎన్.రాధాదేవి — బెంగుళూరు*

* *ఆ అమ్మాయి వచ్చాక అబ్బాయికి బాగా కలిసి వచ్చింది.*

లాభనష్టాలు అబ్బాయి జాతకాన్ని బట్టి ఏర్పడుతాయి. అమ్మాయికి ఈ విషయంలో ఎట్లాంటి సంబంధం లేదు. ఇప్పుడు కలిసి వచ్చిందన్న వాళ్లు రేపేమైనా నష్టం వస్తే అమ్మాయిపై అభాండాలు వేయరని నమ్మడం ఎట్లా?

*బైరాని లక్ష్మీనరసమ్మ — ఉదయగిరి*

* *పశ్చిమ గృహానికి తూర్పు ఆగ్నేయం మెట్లు వుండవచ్చా?*

గృహానికి పశ్చిమ నైరుతి మెట్లు శ్రేష్ఠం. ఆగ్నేయం మెట్ల వల్ల అనారోగ్య, ఆర్థిక దుస్థితికి గురవుతారు.

*జె.సత్యనారాయణ — చెన్నై*

* *దక్షిణ గృహం తాళం వేయబడింది?*

ఇంటి పెద్ద పిల్లలు ఉద్యోగ, ఆర్థిక స్థితులలో సమస్యల నెదుర్కొంటారు. వెంటనే ఇంటిని సరిచేసి కనీసం అద్దెకివ్వండి.

● జిల్లాలో రైతుకు

# అందుబాటులో లేని ఎరువుల విత్తనాలు!

**ఇతర జిల్లాల మాదిరికాకుండా నెల్లూరుజిల్లాలో కాస్త లేటుగా ఖరీఫ్ సీజన్ మొదలైనా రైతులకు అవసరమైన ఎరువులను అందుబాటులో వుంచడంలో వ్యవసాయశాఖాధికారులు పూర్తిగా విఫలమయ్యారు.**

జిల్లాలో ఖరీఫ్ సీజన్ ప్రారంభమైనప్పటికీ రైతుకు అవసరమైన ఎరువులను సేకరించడంలో వ్యవసాయశాఖ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోంది. ఇప్పటికే కొన్ని ప్రాంతాలలో వరినాట్లు వేయగా మరికొన్ని ప్రాంతాలలో నాట్లు వేసేందుకు సమాయత్తమౌతున్నారు. గత సంవత్సరంలో కూడా ఎరువులకు కృత్రిమ కొరత సృష్టించి అధిక ధరలకు విక్రయించారు వ్యాపారులు. తప్పనిసరి పరిస్థితులలో అధిక ధరకు రైతులు కొనుగోలు చేయక తప్పలేదు.

ఈ ఖరీఫ్ సీజన్‌లో పెన్నాడెల్టాలో 2లక్షల 47 ఎకరాలు, సోమశిల ప్రాజెక్ట్ క్రింద లక్షా 27వేల 700 ఎకరాలు, కనుపూరు కాల్వ కింద 33వేల ఎకరాలు, కండలేరు రిజర్వాయర్ కింద మరో 50 వేల ఎకరాలలో వరిపంట సాగు జరుగుతోంది. అయితే సాగు విస్తీర్ణం, సాగునీరు విడుదల విషయంలో వ్యవసాయశాఖ, నీటిపారుదలశాఖల మధ్య సమన్వయం లోపంతో రెండు శాఖలు కూడా స్పష్టమైన ప్రకటన చేయలేకపోవడంతో ఎవరికివారు తోచిన విధంగా విస్తీర్ణం గురించి ప్రకటించేస్తున్నారు. దీంతో రైతులలో గందరగోళ పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

## విత్తనాల పంపిణీపై విమర్శలు

ఈ సంవత్సరం జిల్లాలో మెట్ట ప్రాంత రైతులకు రాయితీపై పంపిణీ చేసిన విత్తనాలపై విమర్శలు వెల్లువెత్తాయి. అర్హులైన రైతులను తప్పించి అర్హతలేని రైతులకు అధికంగా రాయితీ విత్తనాలు అందించారన్న ఆరోపణలు వ్యవసాయశాఖ అధికారులు ఎదుర్కొంటున్నారు. మినుము 5,500 క్వింటాళ్లు, శనగలు 10వేల క్వింటాళ్లు, పెసర 100 క్వింటాళ్లు, ప్రొద్దుతిరుగుడు 600 క్వింటాళ్లు, మొక్కజొన్న 100 క్వింటాళ్లు, వేరుశనగ 4500 క్వింటాళ్లను యాభై శాతం రాయితీపై సరఫరా చేయాలన్న లక్ష్యంగా నిర్ణయించారు. వీటిలో ఇప్పటి వరకు మినుములు 4830 క్వింటాళ్లు, శనగలు 8844 క్వింటాళ్లు, పెసర 17 క్వింటాళ్లు, మొక్కజొన్న 10 క్వింటాళ్లు, పొద్దుతిరుగుడు 20 క్వింటాళ్లు, వేరుశనగ 2224 క్వింటాళ్లు పంపిణీ చేయడం జరిగింది. ఇదిలా వుండగా జాతీయ ఆహారభద్రతా మిషన్ పథకం కింద కిలోకు 500రూపాయల రాయితీపై 50వేల క్వింటాళ్ల విత్తనాలు సరఫరా చేయమని ప్రభుత్వం నిర్ణయించగా అధికారులు సరైన విధానం అవలంభించకపోవడంతో కేవలం 21,265 క్వింటాళ్ల విత్తనాలు సరఫరా కాబడ్డాయి.

ఖరీఫ్ సీజన్‌లో వ్యవసాయ శాఖ అధికారులు అవలంభిస్తున్న తీరుపై రైతులతోపాటు ప్రజాప్రతినిధులు కూడా అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఏపి సీడ్స్ నుంచి విత్తనాలు సేకరించే దగ్గర నుంచి వరిసాగు విధానం గురించి రైతులకు అవసరమైన అన్ని సలహాలు, సూచనలు చేయాల్సిన బాధ్యత వ్యవసాయశాఖ అధికారులపై వుంటుంది. అయితే ఈ శాఖ అధికారులు మాత్రం తూతూమంత్రంగా సదస్సులు నిర్వహించి చేతులు దులుపుకొంటున్నారు.



బ్లాక్‌మార్కెట్‌లో ఎరువులు.

ఉపాధి అవకాశాలు

# గ్రామీణ యువతకు ఉపాధి అవకాశాలు కరవు!

**నిరుద్యోగులను గుర్తించేందుకు జిల్లాలోని 46 మండలాల్లో నిర్వహించిన సర్వే తప్పుల తడికగా వుండడంతో గ్రామీణ ప్రాంతాల్లోని నిరుద్యోగుల లెక్క తేలలేదు. వారికి ఉపాధి దొరకలేదు.**

గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు అందకుండా పోతున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా నిధులు సమకూర్చి గ్రామీణ ప్రాంతాలకు చెందిన యువతకు స్వయం ఉపాధి అవకాశాలు, కార్పొరేట్ రంగాలలో ఉద్యోగావకాశాలు కల్పించాలని సంకల్పించాయి. జిల్లాస్థాయి అధికారులు తీసుకొంటున్న అనాలోచిత నిర్ణయాల కారణంగా పట్టణ ప్రాంతాలలోని నిరుద్యోగులకే ఎక్కువ అవకాశాలు దొరుకుతున్నాయి.

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో గ్రామీణ ప్రాంతాలలో వివిధ రకాల పథకాలు అమలు జరుగుతున్నాయి. స్వయం సహాయక సంఘాల్లోని సభ్యుల కుటుంబాలకు చెందిన నిరుద్యోగ యువతీ, యువకులకు వారి అర్హతలను బట్టి వివిధ రంగాలలో నైపుణ్యం పెంపొందించుకొనేందుకు శిక్షణా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శిక్షణ పూర్తి చేసుకొన్న వారికి చెన్నై, హైదరాబాద్ నగరాలలోని బహుళజాతి కంపెనీలలో ఉపాధి అవకాశాలు కల్పించి జీవన ప్రమాణాలు మెరుగుపరచే ఉద్దేశ్యంతో ఎంప్లాయ్‌మెంట్ జనరేషన్ అండ్ మార్కెటింగ్ మిషన్ కార్యక్రమం రూపొందించబడింది.

నిరుద్యోగులను గుర్తించేందుకు జిల్లాలోని 46 మండలాల్లో సర్వే కూడా జరిపారు. సర్వేచేసిన బృందాలకు గ్రామీణ ప్రాంతాల స్థితిగతులపై సరైన అవగాహన లేకపోవడంతో పూర్తి వివరాలు సేకరించలేక పోయారు. మొత్తం జిల్లాలో 961 గ్రామ పంచాయితీలున్నాయి. ఒక్కో పంచాయితీ పరిధిలో కనీసం రెండు, మూడు గ్రామాలు వున్నాయి. మేజర్ పంచాయితీల పరిధిలో అయితే ఐదు నుండి ఏడు గ్రామాలు వున్నాయి. ఈ వంతున దాదాపు రెండు వేల గ్రామాల వరకు వస్తాయి. సర్వే బృందాలు కేవలం వెయ్యి గ్రామాల్లో మాత్రమే సర్వే చేసినట్లు చెబుతున్నాయి.

లక్షల్లో నిరుద్యోగుల సంఖ్య వుంటే సర్వే బృందాలు సగం మంది కూడా లేరని తేల్చడం ఆశ్చర్యం కలిగిస్తుంది. జిల్లాలో 44,824 మంది నిరుద్యోగులు వున్నారని, వీరిలో పురుషులు 12,831, మహిళలు 31,993 మంది వున్నారని సర్వే బృందం నివేదించింది. వీరిలో పదవ తరగతి లోపు వారు 4,294, పదవ తరగతి పాసైనవారు 4,118, ఇంటర్ పాసైనవారు 21,428, డిగ్రీ పాసైనవారు 1,730, ఐటిఐ పాసైనవారు 344 మంది నిరుద్యోగులుగా వున్నట్లు గుర్తించారు. సర్వే వివరాలు చూసిన అధికారులే పై సంఖ్యను చూసి సర్వే సక్రమంగా జరగలేదన్న అభిప్రాయం అంగీకరించక తప్పు లేదు.

2010 – 11 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి 5,160 మందికి శిక్షణ ఇవ్వాలన్న లక్ష్యంగా నిర్ణయించారు. సరైన ప్రచారం లేకపోవడంతో 1896 మందికే శిక్షణ ఇప్పించాల్సి వచ్చింది. వీరిలో 479 మంది ఉపాధి పొందినట్లు అధికారులు చెబుతున్నారు. ఎంప్లాయ్‌మెంట్ జనరేషన్ అండ్ మార్కెటింగ్ మిషన్ కార్యక్రమాన్ని అమలు చేసేందుకు నలుగురు ఏపిఎంలను డిఆర్‌డిఏ నియమించింది. వీరికి అప్పగించిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించ లేకపోతున్నారు. గ్రామీణ స్థాయిలో ఈ కార్యక్రమం గురించి యువతకు అవగాహన కల్పించి, శిక్షణ ఇప్పించలేక పోతున్నారు.

కేవలం క్రిందిస్థాయి సిబ్బందిపై ఆధారపడి వివరాలు సేకరించడంతో ఈ పథకం లక్ష్యం నెరవేరకుండా పోతుంది. మరోప్రక్క ఎంపికచేసిన నిరుద్యోగులకు వివిధ రంగాలలో శిక్షణ ఇప్పించేందుకు అధిక శాతం నిధులు ఖర్చు చేస్తున్నారు. ప్రైవేటు సంస్థలతో విడుదల చేస్తున్న నిధుల వివరాల గురించి మాత్రం సంబంధిత అధికారులు వెల్లడించేందుకు నిరాకరిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల యువతీ, యువకుల కోసం రూపొందించిన ఈ కార్యక్రమం అభాసు పాలవ్వకుండా జిల్లాస్థాయి అధికారులు స్పందించాల్సిన అవసరం వుంది.

# అతగాడు నచ్చాలి!



బాలీవుడ్‌పై గురి పెట్టి దక్షిణాదిలో కెరీర్‌ను నాశనం చేసుకొన్న నటిగా అసిన్‌ను అభివర్ణించవచ్చు. హిందీలో ఆమె నటించిన గజని సూపర్‌హిట్టయినా, లండన్ డ్రీమ్స్ ఫ్లాప్ అయ్యి అవకాశాలు లేకుండా చేసింది. దీంతో దక్షిణాది చిత్రాల్లో నటిస్తానని సందేశాలు పంపుతున్నా వీటిని అందుకొనే నిర్మాతలు లేరు. దీంతో పెళ్లి వైపు దృష్టి సారించిందని ఆమె మాటలు బట్టి తెలుస్తుంది. మనసుకు నచ్చిన వ్యక్తి తారసపడితే కచ్చితంగా ప్రేమిస్తాను. అతగాడు నటుడే కావాల్సిన అవసరం లేదు. అతనితో డేటింగ్ కంటే ముందు ప్రేమిస్తాను. ఎలాంటి అబ్బాయి జీవిత భాగస్వామిగా సరిపోతాడనే విషయంలో నా ఆలోచనలు నాకున్నాయి. తాను చేసే వంటతోపాటు తన భావాలకు కూడా ప్రాధాన్యం ఇచ్చేవాడైతే తన కిష్టమంటుంది అసిన్.

# గుడులు వద్దన్నాను!



అనకూడదు గానీ తమిళ తంబీలు ఏ విషయంలోనైనా కాస్త అతిగా ప్రవర్తిస్తారంటుంది ముద్దు బొద్దుగుమ్మ నమిత. నా పేరిట తమిళనాడులో గుడులు కట్టే సాంప్రదాయానికి నేనే స్వయంగా కల్పించుకొని ఫుల్‌స్టాప్ పెట్టించాను. అయినా ఆరాధన వరకూ ఓ.కె. గుడి కట్టడం, పూజలు చేయడం కొంచెం ఇబ్బంది కల్గించే అంశం. గుడికట్టి దేవుడుగానో, దేవతగానో మార్చకండని అభిమానులను కోరుతున్నాను. అభిమానులు వాళ్ల మనసుల్లో నాకు చోటిస్తే చాలంటుంది నమిత. నటిగా నాలుగు కాలాల పాటు కొనసాగాలంటే నేను సన్నబడాల్సిందే. ఆ దిశగా కసరత్తులు చేస్తున్నానంది.



# దేహ ప్రదర్శన నేటి ఫ్యాషన్

విష్ణు సరసన వస్తాడు నారాజు చిత్రంలో హీరోయిన్ తాప్సీ అతిగా అందాల ప్రదర్శన చేసిందని విమర్శ రేగింది. ఇదే విషయాన్ని ఆమెను అడిగితే చాలీ చాలని దుస్తులు వేసుకొంటున్నది హీరోయిన్లేనా? బయట కూడా పలువురు అమ్మాయిలు ఇలా కన్పిస్తున్నారు. వాళ్లను మాత్రం ఎవరు ప్రశ్నించరు. నిజం చెప్పాలంటే అందాల ప్రదర్శనే నేటి ఫ్యాషన్. ప్రేక్షకులకు మమ్మల్ని ఇలా చూస్తేనే ఆనందం. దర్శకులు కూడా ఇదే మాట చెబుతారు. వాళ్లు చెప్పింది చేయడమే మా పని. నటిగా రాణించాలని, నిరూపించుకోవాలని మాకు వుంటుంది. ముందు అటువంటి అవకాశాలు రావాలిగా అంటుంది ఈ గడుసరి.

# హైదరాబాద్‌కు నయన



దక్షిణాది తారల్లో అందరికంటే ఎక్కువగా వార్తల్లో కనిపించే నయనతార మీడియాకు ఆమడదూరంలో మసలుతుంది. ఎంతదూరం జరిగితే అంత దగ్గరవుతామనే విషయాన్ని ఆదిలోనే పసిగట్టడం వల్ల ఈ విధంగా చేస్తున్నట్లుంది. ప్రభుదేవాను పెళ్లి చేసుకోవాలన్న నయనతార ఆశ సఫలం కాకపోవడంతో కొన్నాళ్లు మౌనంగా వుండాలని ఈ జంట నిర్ణయించుకొన్నారట. దీనిలో భాగంగానే నయనతార తన మకాం హైదరాబాద్‌కు మార్చుతుంది. ఈ మధ్య తెలుగు దర్శకులందరికీ ఫోన్ చేసి పలుకరించిందట. ఇక వరుసగా తెలుగులో చిత్రాలు చేస్తానని చెబుతూ టచ్‌లో వుంది. ప్రస్తుతానికి బాలకృష్ణ సరసన 'శ్రీరామ రాజ్యం' సినిమాలో నటిస్తుంది. వెంకటేష్‌తో ఒక సినిమా చేసేందుకు ఒప్పుకొందని తెలుస్తోంది.

# పౌరాణిక పాత్రలు చేయాలి!



హీరో నాగార్జున చిత్రపరిశ్రమలోనికి ప్రవేశించి పాతికేళ్లయ్యింది. ఈ పాతికేళ్లలో నటుడిగానే కాకుండా వ్యాపారవేత్తగా చాలా ఎత్తుకు ఎదిగారాయన. ఇన్నేళ్ల సినీ జీవితాన్ని ఎలా విశ్లేషించుకొంటున్నారంటే అన్ని రకాల పాత్రలు చెయ్యాలన్న దృక్పదంతో కథల్ని ఎంచుకొన్నాను. అనుకున్నట్లే కలకాలం గుర్తుండిపోయే చిత్రాలు చేశాను. ఆణిముత్యాల్లాంటి సినిమాలు నా కెరీర్‌లో వున్నాయన్న సంతృప్తి నాకుంది. పౌరాణికాలు మినహా అన్నిరకాల పాత్రలు చేశాను. ప్రతి పాత్రలో నటుడిగా ఒక్కో మెట్టు ఎక్కే ప్రయత్నం చేశా. ఇప్పటికీ చేస్తునే వున్నాను. పౌరాణికాలు అంటే చాలా ఇష్టం. అటువంటి స్క్రిప్టులు తన వద్దకు వస్తే తప్పకుండా చేస్తానన్నారాయన.

# మాస్ రగడ



✍ అల్లూరు రహీం

హీరో నాగార్జున చిత్రపరిశ్రమలోనికి ప్రవేశించి ఈయేడాదికి పాతికేళ్లయ్యింది. అయితే గత రెండేళ్లుగా నాగార్జున నటించిన డాన్, కింగ్, కేడి చిత్రాలు పెద్దగా ఆడలేదు. అయినా నెల్లూరీయుడు శివప్రసాద్‌రెడ్డి ధైర్యం చేసి మాస్ ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకొని శ్రీకామాక్షి ఎంటర్‌ప్రైజెస్ పతాకంపై నాగార్జునను హీరోగా పెట్టి రగడ చిత్రాన్ని తీశారు. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం అన్నీ వీరు పోట్లనే. ఆయన నాగార్జున అభిమాని. అందువల్ల నాగార్జునను ఏవిధంగా వెండి తెరపై చూపిస్తే ప్రేక్షకులు మెచ్చుతారన్న కోణంలో సన్నివేశాలు బాగా దట్టించి రగడ తీశారు. లోగడ నాగార్జున నటించిన ఘరానాబుల్లోడు, హలోబ్రదర్ చిత్రాల్లో కన్నా ఈ చిత్రంలో ఆయన స్టైలిష్‌గా కనపడతాడు. ఆయన నడుస్తుంటే బూట్ల క్రింద నిప్పులు రేగుతాయి. కాలర్‌ను వెనుక నుంచి తమాషాగా ఎగురవేస్తాడు. ఫైట్స్ విలక్షణంగా చేశాడు. హీరోయిజం చాలదన్నట్లు అందాల హీరోయిన్లు అనుష్క, ప్రియమణి పోటీపడి చేసిన అందాల ప్రదర్శన ప్రేక్షకులను కన్నార్పనీయదు. బ్రహ్మానందం, మాస్టర్ భరత్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం కాంబినేషన్‌లో కామెడీ కూడా బాగా కుదిరింది. రామజోగయ్యశాస్త్రి ఒక్కడే వ్రాసిన ఆరు పాటలు మాస్ మసాలాలు. సునో సునో పాటలో ఛార్మి ఐటమ్ గాళ్‌గా తళుక్కుమనిపిస్తుంది. ఒక్కడంటే పాటలో అనుష్క అందాలకు పోటీగా చిత్రీకరించిన లొకేషన్ కనువిందు చేస్తుంది. నిన్నా మొన్నా పాటలో ప్రియమణి నాగార్జునతో పోటీపడి నర్తించింది. రగడ... రగడ చరణంతో సాగే పాటలో ఇద్దరు హీరోయిన్లలో ఎవరిని చూడాలో తెలియక ప్రేక్షకులు కాస్త తికమకపడతారు. శిరీషా... శిరీషా పాట హీరోయిన్ నామధేయస్మరణ. అన్ని పాటలకు థమన్ అందించిన బాణీలు బ్రహ్మాండం. సర్వేష్ మురారి కెమెరా, విజయ్ ఫైట్స్ ఆకర్షణీయంగా వున్నాయి. పొడిపొడిగా దర్శకుడు వీరూనే వ్రాసిన మాటల్లో కలిసొస్తే చెరకు గడ... లేకుంటే రగడ, అమ్మాయిలు వాళ్లకన్నా అందగత్తెలను భరించలేరు. సీమ నాటు... సిటీ నీటు, తలతోపాటు తల పొగరు ఎక్కువ, అమ్మాయిలకు పడిపోయినవాడు... మందు తాగి నోడు ఒకటే, నేను మల్టీప్లెక్స్‌ను... నా బుర్రలో ఒకేసారి ఆరుషోలు ఆడుతాయి బాగున్నాయి. అయితే ఒకసారి హీరో దిన ఫలానికి బదులు ఇవ్వాళ నా వారఫలం బాగోలేదంటాడు. రెండింటి మధ్య వున్న చిన్న తేడా దర్శకుడికి తెలిసినట్లు లేదు.

ఇక చిత్రకథలోనికి వెళ్తే కడప మార్కెట్ యార్డ్‌లో వ్యాపారం చేసుకొనే సత్యారెడ్డి(నాగార్జున) సడన్‌గా లారీ ఎక్కి హైదరాబాద్ వస్తాడు. నగర శివార్లలోని ఓ డాబా వద్ద చిన్నసైజు గ్యాంగ్‌లీడర్ జికె (దేవ్‌గిల్) పై మరో గ్యాంగ్‌లీడర్ గంగయ్య(కోట శ్రీనివాసరావు) మనుషులు దాడి చేయబోగా రక్షించి అతని అభిమానం పొందుతాడు. జి.కె. ఇచ్చే పార్టీలో అతని దగ్గర వుండే శిరీష(అనుష్క) హీరోను బాగా ఆకర్షిస్తుంది. జికెను కుషీ చేయను గంగయ్య, అతని కుమారుడు భగవాన్(సుప్రీత్‌రెడ్డి)ని చంపేసి వారి వద్ద కోటి రూపాయలు కొట్టేస్తాడు సత్యా. తన ప్రాణాలు పోయే సమయంలో గంగయ్య నగరంలో అతి పెద్ద గ్యాంగ్‌లీడర్ పెద్దన్న (ప్రదీప్‌రావత్)కు ఫోన్ చేసి సత్యాను చంపమని చివరి కోరిక కోరుతాడు. అప్పటి నుంచి సత్యా పెద్దన్ననే తన టార్గెట్ చేసుకొంటాడు. పెద్దన్న సత్యా

చిత్ర సమీక్ష

వివరాలు రాబట్టగా తన తమ్ముడు దేవేందర్‌రెడ్డి (సత్య ప్రకాష్) కోసం తాను కడపలో చంపించిన డాక్టర్ నిర్మల (వెన్నిరాడై నిర్మల) పెంపుడు కొడుకే సత్యా అని తెలుసుకొంటాడు. మధ్యలో బ్రాహ్మణ యువతి అష్టలక్ష్మి (ప్రియమణి) సత్యాకు దగ్గరవుతుంది. కాని ఆమె వెనుక, శిరీష వెనుక కూడా పెద్ద బ్యాక్‌డ్రాప్‌లు వుంటాయి. అన్నీ రోడ్లు జంక్షన్‌కు చేరినట్లు చివరన అందరూ కడప చేరుతారు. అక్కడ వుండే డాక్టర్ నిర్మల సమాధి వద్ద సత్యా పెద్దన్న ప్రాణాలు తీసి తన మాటను నెగ్గించుకోవడంతో రగడ ముగుస్తుంది.

హీరో నాగార్జున ఈ చిత్రంలో బాగా కష్టపడ్డాడు. అనుష్క, ప్రియమణిల చేత అన్నిరకాల నటనను రాబట్టడంలో దర్శకుడు సఫలమయ్యాడు. విలన్లుగా కోట శ్రీనివాసరావు, ప్రదీప్‌రావత్, దేవ్ గిల్, సుప్రీత్, సుశాంత్ సింగ్ ప్రేక్షకులను మెప్పించారు. రగడ క్లాస్ కన్నా మాస్ ప్రేక్షకులకే బాగా నచ్చుతుంది. 


దుస్థితిలో బోడిగాడితోట రహదారి.

## బోడిగాడితోటలో రోడ్డక్కరలేదా?

బతికున్నప్పుడు ఎంత వెలుగు వెలిగినా చివరకు ఏ నెల్లూరీయుడైనా కాలి కట్టె పోవాల్సింది పినాకినీ నదీతీరంలోని బోడిగాడితోటలోనే. ఇంతకు మునుపు బోడిగాడితోటలో శవ దహనానికి వసతులు లేక జనం అల్లాడి పోయేవారు. చెత్తాచెదారంలోనే ఆత్మీయులకు అంతిమ సంస్కారం చేసి కుమిలి పోయేవారు. రోటరీ క్లబ్ పుణ్యంతో ఇక్కడ అత్యాధునిక దహన వాటిక రూపుదిద్దుకొంది. బతికినన్నినాళ్లు ప్రశాంతంగా లేకపోయినా పరలోక పయనం సమయంలో శుద్ధిగానే వెళ్లి పోయే వసతులు అతి తక్కువ ఖర్చుకే అందుబాటులో వున్నాయి. పినాకినీ తీరంలో దహనవాటిక బాగున్నా మైపాడు రోడ్డు నుంచి బోడిగాడితోటలోనికి 150 మీటర్ల మేర రోడ్డు లేకపోవడంతో ఇటు స్మశాన శకటాలతోపాటు, శవాలతోపాటు వెళ్లే ఆత్మీయులు తమ వాహనాలను ఈ రోడ్డులో నడపలేక నానా ఇక్కట్లు పడుతున్నారు. దీనికితోడు బోడిగాడితోట మొదలయ్యే టర్నింగ్‌లోని కామ్రేడ్ మాలకొండారెడ్డి సమాధి దగ్గర నుంచి లోని వరకు సమాధుల మధ్య చెత్తాచెదారం పేరుకొని డంప్ యార్డ్‌ను తలపిస్తుంది. దుర్వాసనకు ఈ ప్రాంతంలో అడుగు పెట్టాలంటేనే ముక్కు మూసుకోవాల్సి వస్తుంది.

## నెల్లూరులో బాబా సెహగల్!

### ఆటపాటలతో ఆకట్టుకొన్నాడు


సత్యంజీ నగర్‌లో సందడి సృష్టించిన బాబా సెహగల్.

పాప్ సంగీతంలో తనకంటూ ప్రత్యేకశైలిని ఏర్పరచుకొని అంతేస్థాయిలో అభిమానుల్ని సంపాదించుకొన్న వ్యక్తి బాబా సెహగల్. కొన్నాళ్ల క్రితం చిరంజీవి కథానాయకుడిగా వచ్చిన రిక్షావోడు సినిమాలో రూపు తేరా మస్తానా... అంటూ గళమెత్తిన గొంతుతో పాప్ స్టైల్లో పాటపాడి ఆంధ్రా జనాన్ని ఉర్రూతలూగించిన సింగర్ ఆయన. ఆ తర్వాత అడపాదడపా తెలుగు సినిమాల్లో పాటలు పాడినా కొంత గ్యాప్ తర్వాత తిరిగి ఇటీవల కాలంలో తన గొంతుతో తెలుగు సినీ సంగీత ప్రియులను మంత్రముగ్దులను చేస్తున్నాడు. తన గాత్రంతోనే కాకుండా స్టెప్పులతో ప్రేక్షకులను అలరింపజేసే బాబా సెహగల్ నగరంలో జరిగే కార్యక్రమంలో పాల్గొనేందుకు విచ్చేశాడు. ఈ సందర్భంగా ఆయన విలేకరులతో ముచ్చటించాడు. మాది లక్నో నగరం. జస్‌బీ, జస్మత్‌లు తల్లితండ్రులు. చిన్ననాటి నుంచే సంగీతంపై వున్న ఆసక్తితో పాటలు పాడుతుండేవాడిని. హిందీ చలన చిత్రసీమలో నా గొంతుతో ఎందరో అభిమానులను సంపాదించుకొన్నా నా అభిమాన గాయకుడు కిషోర్‌కుమార్. ఆయన ప్రభావం నాపై ఎంతో వుంది. కిషోర్‌జీ స్ఫూర్తితో పాటలు పాడడం ప్రారంభించా. మొదట్లో కొన్నాళ్లపాటు రికార్డింగ్ స్టూడియో నిర్వహించా. ఆ తర్వాత పాప్ సంగీతం నన్ను ఆకట్టుకొంది. దీంతో పాప్ గీతాలను, ప్రైవేట్ ఆల్బమ్‌లు పాడాను. క్రమంగా చిత్రరంగంలో అడుగు పెట్టాను. హిందీ చిత్రాలతోపాటు తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ చిత్రాల్లో పాటలు పాడాను. నాకు అవకాశం ఇచ్చి తెలుగులో పాడించిన వారు చిరంజీవి, మ్యూజిక్ డైరక్టర్ కోటి. ఇటీవల కాలంలో జల్సా, డాన్, ఈ మధ్య విడుదలైన రగడ వరకు ఎన్నో అద్భుత గీతాలు పాడే అవకాశం లభించిందన్నారు. నెల్లూరు నగరం, ఇక్కడి భోజనం కూడా ఎంతో ఆకట్టుకొందని బాబా సెహగల్ చెప్పుకొచ్చారు.

## కడప ఉప ఎన్నికపైనే

మొదటి పేజీ కొరవ

డబ్బులకు వెతుకులాడిన కుటుంబం, ఆరేళ్లలో మహా రాజులను మించి పోవడాన్ని సహజంగానే సాధా రణ జనం జీర్ణించుకోలేరు. ఇది కాక, వైఎస్ బ్రతికి వున్నప్పుడు తన మనిషి అనుకొన్న ప్రతి ఒక్కడినీ ఆర్థికంగా పెంచడానికి ప్రయత్నం చేశాడు. అనుచ రులకు కాంట్రాక్ట్ పనులు ఉదారంగా ఇవ్వడమే కాక వారి ఇళ్లలో పెళ్లిళ్లు చదువులకు పెద్ద మొత్తాలు కానుకగా ఇచ్చేవాడు. ఆ కానుకలు అందని వారికి, అదొక అసూయ.

వీటన్నిటికంటే జగన్‌కు క్రిందిస్థాయి కార్యకర్త లతో సంబంధాలు నామమాత్రం. ఆయన ఎప్పుడూ సాధారణ ప్రజలను, కార్యకర్తలను పట్టించుకోలేదు. వారి సంగతి తండ్రి చూసుకొనేవాడు కాబట్టి, ఇబ్బంది కలిగేది కాదు. కానీ ఇప్పుడు ఆ తండ్రి లేదు దానితో కార్యకర్తల వద్దకు చనువుగా వెళ్లడం జగన్‌కు వీలు కావడం లేదు.

ఇన్ని అననుకూలతలు వున్నాయి కాబట్టి, కడప ఎన్నికను ఆషామాషీగా తీసుకోవడం మం చిది కాదనే నిర్ణయానికి వచ్చాడు జగన్. ఉప ఎన్ని కలో గెలిచి తీరడం రాజకీయంగా తనకు తప్పని సరి. అక్కడ గెలవడం వల్ల జగన్‌కు అదనంగా వచ్చే రాజకీయ ప్రయోజనం ఏమీ వుండదు. కానీ ఏ కారణం వల్లనైనా ఓటమి ఎదురైతే మాత్రం, రాజకీ యంగా భూస్థాపితం కాక తప్పదు. స్వంత నియో జకవర్గంలోనే గెలవలేనివాడు, తమనెట్లా గెలిపి స్తాడనే భయంతో ఆయన చుట్టూ చేరిన వారు కూడా పక్కకు తప్పుకొనే ప్రమాదం వుంది.

తాను సునాయాసంగా గెలవాలంటే, కిరణ్ కుమార్‌రెడ్డికి రాజకీయ అనిశ్చితస్థితి సృష్టించక తప్ప దనేది జగన్ ఆలోచన. అందువల్లనే విజయవాడ రైతు దీక్షకు దాదాపు 29మంది కాంగ్రెస్ ఎమ్మెల్యే లను రప్పించాడు. తనతో సంబంధాలు కల్గిన ప్రతి ఎమ్మెల్యే మీదా తీవ్రస్థాయి ఒత్తిడి తెచ్చి మరీ ఎమ్మె ల్యేల సంఖ్య మూడు పదులకు చేరువ చేశాడు. వీరికి అదనంగా కనీసం మరొక ఇరవై మందిని తన వైపు రాబట్టుకోవాలన్నది ఇప్పుడు జగన్ లక్ష్యంగా వుంది. 50 మంది ఎమ్మెల్యేలు తనవైపు వుంటే, కిరణ్ ప్రభుత్వం బలం కోల్పోయినట్లే లెక్క, టిఆర్ఎస్, మజ్లిస్, పిఆర్‌పి వంటి పార్టీలన్నిటినీ కలుపుకొన్నా ప్రభుత్వాన్ని నిలబెట్టలేరు.

ఇప్పటికిప్పుడు కిరణ్ ప్రభుత్వాన్ని పడ గొట్టడం జగన్ వ్యూహం కాదు. తన పార్టీ ఏర్పాటు జరిగి, అన్ని జిల్లాలలో దాని వునికి స్థిరపడే వరకు ఈ ప్రభుత్వం ఇట్లనే వుండాలనేది ఆయన ఆలో చన. అందువల్లనే అవకాశం వచ్చినప్పుడల్లా ప్రభు త్వాన్ని పడగొట్టే ఉద్దేశం తనకు లేదని పదే పదే చెప్తున్నాడు. కానీ కడప ఉపఎన్నిక ఆ వ్యూహాన్ని తారుమారు చేస్తున్నది. ఎన్నిక లోపల ప్రభుత్వాన్ని కూలదోయకుంటే తన రాజకీయ భవిష్యత్తుకు ప్రమా దమన్న ఆలోచన జగన్‌లో కల్గుతున్నదని చెప్తు న్నారు. తెలంగాణ వివాదంపై ప్రభుత్వం తనంత తానుగా పతనమై, రాష్ట్రపతి పాలన వస్తే ఇబ్బంది లేదు. ప్రభుత్వాన్ని పడగొట్టాడన్న నింద తనపై పడకుండా తన పని జరిగిపోతుంది. అది జరగక పోతే మాత్రం ఆ పుణ్యం తానే కట్టుకోక తప్పదని ఆంతరంగికుల వద్ద వ్యాఖ్యానిస్తున్నాడట జగన్.

అయితే ఇప్పుడు జగన్ పక్షంగా వున్న ఎమ్మె ల్యేలు ప్రభుత్వాన్ని కూలగొట్టడానికి సహకరిస్తారా అన్నది అనుమానం. మూడేళ్ల పదవీ కాలం వదలు కోవడానికి సహజంగా ఏ ఎమ్మెల్యే సిద్ధపడడు. ఆ పరిస్థితి వస్తే, వారు ప్రభుత్వ పక్షం చేరుతారు తప్ప జగన్ పక్కన నిలబడరు. అందువల్ల ప్రభుత్వాన్ని పతనం చేయాలని జగన్ ఎంత కోరుకున్నా అది జరిగే అవకాశాలు తక్కువ. తెలంగాణ సంక్షోభంలో రాష్ట్రంలో ప్రభుత్వాన్ని నడపలేని పరిస్థితి ఏర్పడి, రాష్ట్రపతి పాలన విధింపు జరిగితే, జగన్ కోరిక నెరవేరుతుంది.

అవినీతి, అక్రమాలు, కరువు... ఉద్యమాలు,

2010

నేనెలా తిరిగొస్తానోనని భయంగా ఉంది తాతయ్యా..!

2011

నందు

## జనవాణి

2వ పేజీ కొరవ

### మాధవరావు మంచి రిపోర్టర్!

పని పట్ల నిబద్ధత, అంకిత భావం గల ప్రథమశ్రేణి రేడియో రిపోర్టర్, మిత్రుడు దివంగత మాధవరావు. ఈనాడు పత్రిక కావలి విలేఖరిగా 1978 ప్రాంతంలో పాత్రికేయ వృత్తిలో అడుగు పెట్టిన మాధవరావ్ ఆ తర్వాత ఆకాశవాణి నెల్లూరు జిల్లా రిపోర్టర్‌గా పాతికేళ్లు శ్రమించి, తుదిశ్వాస విడిచే దాకా అందరి ప్రశంసలకు పాత్రుడైన మంచి మనిషి. ప్రింట్, ఆడియో మాధ్యమాలను వెనక్కు నెట్టి ఎలక్ట్రానిక్ మీడియా తన వెలుగు జిలుగులతో ప్రేక్షక లోకాన్ని మురిపిస్తున్న ఈ రోజుల్లో కూడా ఉరుకులు, పరుగులతో ఆకాశవాణి నెల్లూరు శ్రోత లకు వార్తలను సేకరించి పెట్టిన నిత్య కృషీవలుడు మాధవరావు. చాలీచాలని జీతభత్యాలతో ఒంటరి బ్రతుకే భారమైన ఈ గడ్డు దినాల్లో తోడబుట్టిన వారి సుఖం కోసం బ్రహ్మచారిగా మిగిలిపోయిన త్యాగ మూర్తి మాధవరావు.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

### అప్పడంపై ఆగ్రహమా?

ఇటీవల తిరుపతిలో ఒక నేతకు వడ్డించిన అప్పడం చివరలు కొంత విరిగాయని ఆ నేత అనుయాయుల ఆగ్రహం కట్టలు తెం చుకొన్నట్లు పత్రికల్లో వార్తలొచ్చాయి. అప్ప డం అతి సున్నితమైనది. చిన్న స్పర్శ తగి లినా దాని రూపం మారిపోతుంది. మొత్తా నికి ఈ నేతకు చివరకు మంచి రూపసి గల అప్పడాన్ని వడ్డించి సంతోష పెట్టా రట. విరిగిన అంచుల అప్పడాలను సామా న్యులకు వడ్డించారట. పేద, ధనికుల మధ్య తేడా వలె వున్నది ఈ అప్పడపు వ్యాఖ్యా నం. విరిగిన అప్పడాలపై ఆగ్రహించడం పిచ్చుక మీద పెద్దల బ్రహ్మాస్త్ర ప్రయోగమే.

కె.సుజాత — కావలి



## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

యలు విద్యుత్ బిల్లులు చెల్లించని కారణంగా కాలే జికి కరెంట్ కట్ చేశారు. బియిడి కాలేజిలో క్లాసు రూముల్లో చిమ్మచీకటి ఆవరించి వుంటుంది. కరెంట్ కట్ చేయడంతో క్లాసులు నడపడం కష్టంగా పరిణ మించింది.

### పిఇటి రాష్ట్రసంఘం నేతగా అల్లూరీయుడు!

రాష్ట్ర వ్యాయమ ఉపాధ్యాయ సంఘం కోశా ధికారిగా పి.విక్టర్ ఎన్నికయ్యారు. హైదరాబాద్‌లో 27తేదీ ఈ ఎన్నిక జరిగింది. విక్టర్ స్వగ్రామం అల్లూరు. వాలీబాల్ ఆటగాడిగా మంచి ట్రాక్ రికార్డు వున్న ఈయన ప్రస్తుతం కృష్ణపట్నం జడ్పీ వున్నత పాఠశాలలో వ్యాయామ ఉపాధ్యాయునిగా పని చేస్తున్నారు. వ్యాయామ ఉపాధ్యాయుల సం ఘం జిల్లా కార్యదర్శిగా పని చేసిన అనుభవ ముందాయనకు.

### ఎన్జీఓ సంఘానికి కొత్త నేతలు

ఆంధ్రప్రదేశ్ నాన్‌గెజిటెడ్ ఆఫీసర్స్ అసోసి యేషన్ జిల్లా అధ్యక్షునిగా సి.రవీంద్రబాబును, కార్యదర్శిగా సి.హెచ్.శ్రీనివాసరావును ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. సంఘం అధ్యక్షునిగా పని చేస్తుండిన ఎం.వెంకటేశ్వరరావుకు ప్రమోషన్ రావడంతో ఈ ఎన్నిక అవసరమైంది.

### అపస్‌కు నూతన కార్యవర్గం

ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘం (అపస్) జిల్లా నూతన కార్యవర్గ ఎన్నిక ఇటీవల జరిగింది. అధ్యక్షునిగా సిహెచ్.వి.కృష్ణారెడ్డి, సహాధ్యక్షునిగా ఎ.మధుసూదన్, ప్రధాన కార్యదర్శిగా సిహెచ్.వెంక టేశ్వర్లు, సంఘటనా కార్యదర్శిగా కె.ప్రభాకర్‌రెడ్డి లను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. అపస్ రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు పి.యుగంధర్‌రెడ్డి, పోలయ్య ఈ ఎన్నికను పర్యవేక్షించారు.

### ఎన్‌బికెఆర్ విద్యార్థుల ప్రతిభ

విద్యానగర్‌లోని ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజిలో చదువుతున్న పలువురు విద్యార్థినీ విద్యా ర్థులను తమ ప్రతిభ ఆధారంగా హైదరాబాద్‌లోని టిసిఎస్ సంస్థలో పని చేయను ఎంపిక చేశారు. కాలేజిలోని 21 మంది విద్యార్థులకు టిసిఎస్ సంస్థ వుద్యోగాలివ్వడంపై కాలేజి కరస్పాండెంట్ నేదురు మల్లి రామ్‌కుమార్‌రెడ్డి, ఛైర్మన్ డాక్టర్ఐ.గోపాల్‌రెడ్డి హర్షం వ్యక్తం చేశారు.

### స్వర్ణభారత్ ట్రస్ట్‌లో వ్యాసరచన పోటీలు

స్వామి వివేకానంద 147వ జయంతిని పురస్కరించుకొని వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్ జనవరి 2వతేది జిల్లాస్థాయి వ్యాసరచన పోటీ లను నిర్వహిస్తుంది. మూడు క్యాటగిరీల్లో జరిగే ఈ పోటీల్లో ఆరు నుంచి పదవతరగతి వరకు ఒక విభాగంగా, ఇంటర్ మీడియట్ పై తరగతులకు రెండవ విభాగం, ఇతరులకు మూడవ విభాగంగా నిర్వహిస్తారు. పోటీలు విఆర్‌కాలేజి, స్వర్ణభారత్ ట్రస్ట్‌లోనూ నిర్వహిస్తారు. పోటీలో పాల్గొనేవారు తమ పేర్లను పోటీ జరిగే రోజు ఓ గంట ముందు నమోదు చేసుకోవచ్చని ట్రస్ట్ ముఖ్యకార్యనిర్వాహ ణాధికారి శరత్ చెప్పారు.

### అమ్మ ఫర్నీచర్ మాల్

నెల్లూరు ప్రజలకు తక్కువ ధరకు నాణ్యమైన ఫర్నీచర్‌ను అందుబాటులోనికి తెచ్చిన అమ్మ ఆక్షన్ సల్, అమ్మ ఫర్నీచర్ సంస్థల నిర్వాహకులు మినీ బైపాస్ రోడ్‌లో కొత్తగా పెట్టిన అమ్మ ఫర్నీచర్ మాల్‌ను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి 30తేదీ ప్రారంభించారు. మంత్రి రామనారాయణరెడ్డి, నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, అమరావతి హోటల్ అధినేత కృష్ణారెడ్డి, మాజీ మేయర్ భానుశ్రీ ఈ కార్యక్రమంలో ముఖ్యఅతిథులుగా పాల్గొన్నారు. ప్రారంభోత్సవానికి విచ్చేసిన ఆత్మీయులను అమ్మ ఫర్నీచర్ మాల్ అధినేతలు గడ్డం సుధాకర్‌రెడ్డి, గడ్డం సుమన్‌రెడ్డి, సుజన్‌రెడ్డిలు సాదరంగా ఆహ్వా నించారు.

### బోగోలులో మంచినీటి క్యాన్ పది రూపాయలే!

స్థానిక సంస్థలు, పంచాయితీలు సురక్షిత మంచినీటిని సరఫరా చేయడంలో విఫలమవ డంతో పట్టణాలు, గ్రామాలు అనే తేడా లేకుండా జనం క్యాన్ వాటర్‌ను కొని తాగుతున్నారు. నెల్లూ రులో 20 లీటర్ల క్యాన్ ముప్పై రూపాయలు అమ్ము తుండగా, బోగోలు యువకుడు బొద్దు మురళీ మోహన్‌రావు ఈ క్యాన్ నీటిని పది రూపాయలకే గ్రామస్తులకు సరఫరా చేస్తున్నాడు. బోగోలు, ఇబ్ర హీంపేటలో మంచినీటి సమస్యతో అల్లాడే జనానికి బిఎంఎంఆర్ క్యాన్ నీళ్లు అమృతంతో సమానమని చెప్పవచ్చు.

● రాజరాజేశ్వరమ్మకు

# శఠగోపం పెడుతున్నారు!

## దేవాలయాన్ని దరిద్రంలా పట్టుకొన్న సన్నపరెడ్డి పెంచలరెడ్డి




మహిమ కల్గిన తల్లిగా పేరుపొందిన రాజరాజేశ్వరమ్మను సైతం వదలిపెట్టడం లేదు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి రామదండు. ఆయన అనుచర మూకలో ముఖ్యుడైన సన్నపరెడ్డి పెంచలరెడ్డి ఈ దేవాలయాన్ని దరిద్రం వలె పట్టుకొని వున్నాడిప్పుడు. ధర్మకర్తల మండలి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌లు పేరుకు మాత్రమే వుంటారిక్కడ. పెత్తనమంతా ఆయనదే. ఎమ్మెల్యే వివేకానందరెడ్డిని ఒక బూచిగా చూపించి అందరి నోళ్లు మూయించడంలో పెంచలరెడ్డి ఎంత సిద్ధహస్తుడో తెలిసిందే. ఇట గారిది గుంటూరుజిల్లా అట. ఆమె వారానికి రెండురోజులు కూడా దేవాలయానికి రాదు. అది అందరికీ అలుసుగా మారిపోయింది. రాజరాజేశ్వరమ్మ సొత్తును ఎవరెంత తినగలిగితే అంతా అప్పనంగా ఆరగించేస్తున్నారు.

దేవస్థానం వెనుకవైపు ఆఫీసు గది కట్టడానికి ఇటీవల దాతల నుంచి ఐదు లక్షల రూపాయల వరకు దండాడట పెంచలరెడ్డి. ఆఫీసు గది మాత్రం కట్టనే లేదు. దేవస్థానంలో అభివృద్ధి కార్యక్రమాల పేరిట ఇదే తీరులో దాదాపు 30లక్షల రూపాయలను భక్తుల నుంచి విరాళాలుగా స్వీకరించారట. కానీ చిండబ్బు అభివృద్ధి జరపలేదు. మొత్తం సొత్తు జీర్ణమై పోయింది. దేవస్థానం పక్కనున్న కళ్యాణ మండపానికి దండే బాడుగ పుస్తకాలలో చూపించడమే మానివేశారు. ఒక్క అయ్యప్ప భక్తుల నుంచి ఈ దసరా నెలలో రెండు లక్షల రూపాయలు బాడుగ తీసుకొన్నారట. కానీ లెక్క పత్రం లేదు. కళ్యాణ మండపం పెంచలరెడ్డి పాలిట కామధేనువుగా మారిందని చెప్తున్నారు. ఏటా పది లక్షల రూపాయల వరకు రాబడి ఇస్తున్నదిది ఆయన అవినీతి దాహానికి. దేవస్థానానికి పూల మాలలు సరఫరా చేసే కాంట్రాక్ట్‌ను మాల్యాద్రి అనే బినామీ పేరిట ఆయనే నిర్వహిస్తున్నాడట. ఆయన ఎంత ధర చెప్తే అంత మొత్తాన్ని దేవస్థానం నిధుల నుంచి చెల్లిస్తున్నది ఇట గారు. గుడి బయట టెంకాయల నుంచి గుడి లోపల ప్రసాదాల వరకు అంతా అవినీతి మయమే. ఈ అరాచకాలకు అడ్డం అను కొన్న ఉద్యోగులను వేధింపులకు గురిచేసి, వారంత వారుగా రాజీనామా చేసి వెళ్లిపోయే పరిస్థితి సృష్టిస్తున్నారట. మరీ మాట వినకుంటే, సస్పెండ్ చేసి పారేస్తున్నారట. పెంచలరెడ్డి అరాచకాలకు ఇట మద్దతు పూర్తిగా వుండడంతో, వారు ఆడింది ఆటగా పాడింది పాటగా నడుస్తున్నది గుడి లోపల.

అయ్యా వివేకానందరెడ్డి గారు, మీరు దోచుకొని తినడానికి, మీ అనుచరుల బొజ్జలు నింపడానికి ఇంత పెద్ద నగరం చాలడం లేదా? చివరకు దేముళ్లకు కూడా శఠగోపం పెట్టాలా? రాజరాజేశ్వరమ్మ కళ్లు తెరవక ముందే మీ అకృత్యాలు ఆపండి.

# పెద్దాస్పత్రికే ఎసరు!

## ● రూరల్ ఎమ్మెల్యే కుటుంబ సభ్యుల అపార్టుమెంట్ కోసం దుస్సాహసం

ఇదిట్లా వుంటే, అనుచరులు మాత్రమే ఆక్రమణలకు పాల్పడితే తనకొచ్చే వాటా తక్కువగా వుంటుందని భావించాడో ఏమో, ఏకంగా తన కుటుంబం చేతనే ఈ దుర్మార్గ పర్వానికి శ్రీకారం చుట్టాడు వివేకానందరెడ్డి. పెద్దాస్పత్రి పడమర ప్రహరీ ఆనుకొని, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఇంటి పక్కన ఒక అపార్టుమెంటు నిర్మిస్తున్నారు ఆయన కుటుంబ సభ్యులు. ఆ సాకుతో ఏకంగా పెద్దాస్పత్రి స్థలానికే ఎసరు పెట్టేశాడు. వెనుకవైపు, ఆస్పత్రి స్థలంలోకి జొరబడి మరీ కడుతున్నారు అపార్టుమెంటు భవనాన్ని. ఎంత దుర్మార్గమైన పనిది? పెద్దాస్పత్రి వంటి ప్రజా ప్రయోజన సంస్థలను కూడా తమ అవినీతి దాహానికి హారతి కర్పూరం చేయాలనుకోవడం దారుణం.

పెద్దాస్పత్రి వ్యవహారాల మీద చట్టపరంగా జిప ఛైర్మన్‌కు నియంత్రణ వుంటుంది. ప్రజా జీవితంలో నీతి నిబద్ధతలకు కట్టుబడిన వ్యక్తిగా మంచిపేరు తెచ్చుకొన్నవాడు కాకాణి గోవర్ధన్‌రెడ్డి. తన పెత్తనంలోని ప్రభుత్వ సంస్థను తన పార్టీకి చెందిన ఎమ్మెల్యే కుటుంబ సభ్యులు ఆక్రమించి, భవనాలు కడుతుంటే ఆయన మౌనంగా ఎందుకు వున్నాడో అర్థం కావడం లేదు. ఆయన కానీ, జిల్లా కలెక్టర్ కానీ తక్షణం పెద్దాస్పత్రి స్థలాన్ని సర్వే చేయించి, ఆక్రమించిన వారిని ఖాళీ చేయించి, ఆ సంస్థను కాపాడడం అవసరం.


నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి వీధిలో కడుతున్న అపార్ట్‌మెంట్.

● ఖుద్దూస్‌నగర్‌లో

# రెండుకోట్ల స్థలం హాంఫట్!

మనిషికొక మాట,గొడ్డుకొక దెబ్బ అన్నది పెద్దలు చెప్పే పద్ధతి. మనిషన్న వాడు మాట చెప్తే వినాలన్నది సాంప్రదాయం. కానీ మన రాజకీయవాదులు, అధికారులు గొడ్ల కంటే హీనంగా తయారౌతున్నారు. వారికి చెప్పే మాటలన్నీ దున్నపోతు మీద కురిసే వానగా వృధా అయిపోతున్నాయి.

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఆయన అనుచర బృందం బందిపోటు దొంగల వలె మారి, వూరి మీద పడి నానా గలీజు పనులు చేస్తున్నారని గతవారం కొంత కఠినంగానే వ్రాశాము. వారి అరాచకాలకు నిదర్శనాలైన పలు సంఘటనలను పూర్తి ఆధారాలతో ప్రచురించాము. వాటి పట్ల అధికారుల ఉదాసీనతను ఎండ గట్టాము. వారు మనుషులైతే, తాము చేసిన తప్పులకు చెంపలేసుకొని, ఆ అక్రమాల నుంచి వైదొలగి వుండేవారు. కానీ పశువుల కంటే హీనమైన నీచులు కావడం వల్ల గతవారం చెప్పిన దానికంటే నీచంగా ప్రవర్తిస్తున్నారు. మా తీరు ఇంతే అని ప్రజలకు ధాటిగా చెప్పుకోవడం వారి వుద్దేశ్యంగా వున్నట్లుంది.

ఈ వారంలో కొత్తగా మరొక భూదురాక్రమణకు పాల్పడింది వివేకానందరెడ్డి మూక. మునిసిపల్ ఆఫీసు సమీపంలోని ఖుద్దూస్ నగర్‌లో, పార్క్ కోసం రిజర్వు చేసి వుండిన అరెకరా స్థలాన్ని, స్థానిక రౌడీషీటర్ ఒకడు రాత్రికి రాత్రి ఆక్రమించి, మట్టి తోలి, ప్లాట్లుగా విభజించి, అమ్మకానికి పెట్టేశాడు. దాదాపు రెండు కోట్ల రూపాయలు చేసే స్థలం ఇది. దీన్ని ఆక్రమించుకోవడానికి గతంలో చాలా మంది ప్రయత్నం చేశారు. కానీ స్థానికులు ఆ ప్రయత్నాలను ప్రతిఘటించి, ఆక్రమణ జరగకుండా చూసుకొన్నారు. మునిసిపల్ అధికారులు కూడా దాని చుట్టూ ఫెన్సింగ్ వేసి, కాపాడుతుండినారు. కానీ ఇప్పుడు ఆక్రమణకు పూనుకొన్నది రౌడీషీటర్ కావడం, అతగాడికి ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అండదండలు పుష్కలంగా వుండడంతో, స్థానిక పెద్దలు చూస్తూ వూరుకోవడం తప్ప ఏమి చేయలేక పోతున్నారు. అంకణం ధర రెండు లక్షలు పలికే ఖరీదైన చోటు ఇది.


మెక్లిన్స్‌రోడ్డులోని సిటిజన్స్ స్కూల్ వెనుక పార్కు స్థలం దురాక్రమించి రబ్బిష్ పోసి చదును చేస్తున్న దృశ్యం.

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/09-11

# నెల్లూరులో ఘనంగా క్రిస్మస్!

## • బాలయేసు తేరు ఉత్సవం బ్రహ్మాండం



బాలయేసు తేరు ఉత్సవంలో భక్తులను ఆశీర్వదిస్తున్న నెల్లూరు బిషప్ ప్రకాశం.

నెల్లూరు నగరంలోని క్రైస్తవ సోదరులు క్రిస్మస్ పండుగను ఘనంగా జరుపుకొన్నారు. నగరంలో క్రైస్తవులు గణనీయమైన సంఖ్యలో నివశిస్తుండడంతో నెల్లూరుకు పండుగ కళ వచ్చింది. 24వ తేది అర్ధరాత్రి నుంచి చర్చిలలో ఎదుర్కోలు సందేశం వినేందుకు వేలాది భక్తులు పవిత్ర గ్రంథం బైబిల్‌ను చేతపట్టుకొని వెళ్లారు. లోకరక్షకుని జననానికి సూచన అయిన నక్షత్రాన్ని, ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన క్రిస్మస్ ట్రీలను ఇళ్ల ముంగిట ఏర్పాటు చేశారు. 25వ తేది విఆర్‌సి కూడలిలోని డౌనీహాల్‌కు పెద్ద సంఖ్యలో క్రైస్తవులు ప్రార్థనకు తరలి రావడంతో ఈ ప్రాంతంలో చాలా సేపు ట్రాఫిక్ నిలచి పోయింది. సుబేదారుపేటలోని ది లోన్ స్టార్ తెలుగు బాప్టిస్ట్ చర్చిలో రెవరండ్ కంచర్ల ప్రభుదాస్ క్రీస్తు బోధనలకు అనుగుణంగా జీవనం సాగించాలని ప్రభు విశ్వాసకులను కోరారు. సుబేదారుపేటలోని సెయింట్ జోసఫ్స్ సెంట్రల్ క్యాథడ్రిల్ చర్చి, రైల్వే ఫీడర్స్ రోడ్డులోని ది లోన్ స్టార్ చర్చి, పొదలకూరు రోడ్డులోని సాల్వేషన్ ఆర్మీ, రామిరెడ్డిపేట, బట్వాడిపాళెంలోని బాప్టిస్ట్ చర్చిలోనూ ఘనంగా క్రిస్మస్ వేడుకలు జరిగాయి. నగర శివార్లలోని వెంకటేశ్వరపురం, జనార్ధన్‌రెడ్డి కాలనీ, శ్రామిక్ నగర్, రామకోటయ్య నగర్, చంద్రబాబు నగర్, కొండాయపాళెం ప్రాంతాలలోని చర్చిలకు పెద్ద సంఖ్యలో భక్తులు విచ్చేశారు. తమ నివాసానికి సమీపంలోని సెయింట్ జోసెఫ్స్ క్యాథడ్రిల్ చర్చి ఆవరణలో జరిగిన బాలయేసు తేరు ఉత్సవంలో మంత్రి రామనారాయణరెడ్డి, రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పాల్గొన్నారు.









Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.